# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[Part II—Proceedings other than Questions and Answers]

OFFICIAL REPORT

---

*Twenty fifth day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 19th February,* 1958

The House met at Two of the Clock

[*Mr Speaker in the Chair*]

### Questions and Answers

(See Part I)

### Business of the House

శ్రీ యస్ వి చంగాల్రాయ నాయుడు (వేపంజేరి) —అధ్యక్షా, Point of information మాకు quarterly list of gazetted officers అని ఒకటి ఇచ్చారు 1957 ఏప్రిల్ వరకు correct చేశామని చెప్పారు 1958 ఏప్రిల్ వస్తున్నది ఈ list లో వున్నవారు ఎవరూ ఇప్పుడు వుండరు, అనవసరపు ఖర్చు అందుచేత quarterly లనే దానికంటే annual అని 1958 కి ఇస్తే బాగుంటుందేమోనని మనవి చేస్తున్నాను మళ్ళీ tax వేయకుండా ఇటువంటి పనులు చేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను

శ్రీ బి శంకరయ్య (జనరల్) —అధ్యక్షా! సభా వ్యవహారాలను తెలుగులో నడుపుకోవటానికి వీలుగా Rules ను త్వరలోనే ప్రకటిస్తామని చెప్పారు కాని ఇంత వరకు ప్రకటించలేదు త్వరలో ప్రకటించేటట్లు చూస్తారా?

మిస్టర్ స్పీకర్ —చూస్తాము

ఆర్థికమంత్రి (డాక్టర్ బి గోపాలరెడ్డి) —దానికి కావలసిన పర్యాయ పదములను అనువదించటానికి ఒక కమిటీ వున్నది కదా ఆ పని పూర్తి అవనవసరంలేదా?

మిస్టర్ స్పీకర్ —Rules మార్చాలని ఒక కమిటీని వేశాము ఆ కమిటీ కొన్ని Rules తయారు చేసింది కాని అది ఇంకా రాలేదు ఇప్పుడు మనకు వున్న Rules ప్రకారము English ఒక్కటే ఈ శాసనసభకు సంబంధించి Official Language గా వుంది "English shall be the Official Language for the business and procedure to be conducted in the Legislative Assembly" అయితే కన్నడము, తెలుగు అని వుండాలని ప్రశ్నలు ప్రత్యేకంగా తెలుగు ఒక్కటే వుండాలని గవర్నమెంటువారు ఒక Official Language Bill తీసుకు రావాలి శాసనసభలో ఇంగ్లీషు, తెలుగు, రెండు వుండాలని Rules చేసినప్పుడు తెలంగాణా రీజినల్ కమిటీ ఏర్పాటు అవుతున్నది కౌన్సిల్ ఏర్పాటు అవుతున్నది ఈ విషయాలన్నిటిని చర్చి పునరాలోచించి రూల్సు ఆధారం చేయాలని ఆ కమిటీ సభ్యులున్నారు తెలంగాణాకు సంబంధించిన వారిని కూడ నియమించాలని అనుకొంటున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —అధ్యక్షా! కౌన్సిల్ వచ్చిన తరువాత వారితో సంప్రదిస్తే బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ —ఇవంత ముఖ్యమైనది కాదు తెలంగాణా వారిని కూడ చేర్చి నియమించే అధికారం నాకు తీసుకొంటున్నాను ముఖ్యమంత్రితో సంప్రదిస్తాను గౌరవ సభ్యులకు దీనికి ఏమీ అభ్యంతరం వుండదని తలుస్తాను

ఒక Adjournment motion వుంది అనంతపురంలో "failure of commercial crops and groundnuts" గురించి దానిని తెచ్చారు ఇది adjournment motion క్రింద కాదు రేపు బడ్జెట్ లో చర్చ వచ్చినప్పుడు మాట్లాడ వచ్చు అప్పుడు మంత్రిగారు జవాబు చెబుతారు కనుక ఇప్పుడు నేను దీనిని అంగీకరించటము లేదు

రెండవది, బెజవాడలో ఒక శాసనసభ్యుడు మాట్లాడుతూ వుండగా కొంత గొడవ జరిగిందని ఇది ప్రివిలేజి తీర్మానం క్రింద రావలసినదని శ్రీ టి వి రాఘవులుగారు కోరారు ఇది ప్రివిలేజి క్రింద రాదు House కు సంబంధించి ప్రయాణిస్తున్నప్పుడు, ఉపన్యాసం ఇస్తున్నప్పుడో, లేక ఈ శాసన సభలో మాట్లాడిన విషయాలను గురించి బయట ప్రశ్నించినప్పుడో ప్రివిలేజి క్రిందకు వస్తుంది ఇటువంటి విషయాలకు పోలీసులు వున్నారు కోర్టులు వున్నాయి మంత్రి గారితో చెప్పవచ్చు ఇది ప్రివిలేజికి సంబంధించినది కాదు కాబట్టి నేను ఆ ప్రివిలేజి మోషన్ను త్రోసివేస్తున్నాను

## Papers Laid on the Table of the House

### Rules under the Motor Vehicles Act 1939 (Central Act IV of 1939)

*The Chief Minister (Sri N Sanjiva Reddy)* I beg to lay on the Table, under Section 133(3) of the Motor Vehicles Act 1939 (Central Act IV of 1939) a copy of the Rules under Chapters I and IV-A of the Motor Vehicles Act 1939 (Central Act

IV of 1939), published at pages 314-317 of the Rules Supplement to Part I of the Andhra Pradesh Gazette dated 24-10 57 as subsequently amended at page 344 of the Rules Supplement to Part II of the Andhra Pradesh Gazette, dated 7 11-57

*Mr Speaker* Papers laid on the Table of the House

*Annual Report and Accounts of the Andhra Pradesh State Financial Corporation for the year* 1956 57

*Sri N Sanjiva Reddy* I beg to lay on the Table under section 38(3) of the State Financial Corporations Act, 1951, a copy of the Annual Report and the Accounts of the Andhra Pradesh State Financial Corporation for the year 1956-57

*Mr Speaker* Papers laid on the Table of the House

*Andhra (Inam) Tenants Restoration to Possession Rules* 1957 *as amended by the Assembly*

*The Minister for Revenue (Sri K Venkat Rao)* I beg to lay on the Table a copy of the Andhra (Inam) Tenants Restoration to Possession Rules, 1957 as amended by the Assembly on 21-11-1957

*Mr Speaker* Papers laid on the Table of the House

*Andhra Pradesh Agricultural Produce (Development and Warehousing) Corporation Rules* 1957

*The Minister for Agriculture (Sri P Thimma Reddy)* I beg to lay on the Table under sub section (3) of section 52 of the Agricultural Produce (Development and Warehousing) Corporations Act, 1956 (Central Act No XXVIII of 1956) a copy of the Andhra Pradesh Agricultural Produce (Development and Warehousing) Corporations Rules 1957, issued under the said Act, in G O Ms No 1307, Agriculture dated the 22 8-1957

*Mr Speaker* Papers laid on the Table of the House

## Draft Rules relating to the Hyderabad and Secunderabad Municipal Corporations Profession Tax

**The Minister for Local Administration (Sri K Brahmananda Reddy)* I beg to move ·

"That the following draft of the rules relating to the Hyderabad and Secunderabad Municipal Corporations' Profession Tax, proposed to be made by the Governor of Andhra Pradesh in exercise of the powers conferred by sub section (1) of section 585 of the Hyderabad Municipal Corporation Act 1955 (Hyderabad Act II of 1956), hereinafter referred to as the said Act, be approved, the same having been previously published as required by sub section (3) of section 585 of the said Act"

హైదరాబాదు శాసనం (1951) ప్రకారం rules ఉన్నాయి తరువాత, క్రొత్త హైదరాబాదు మ్యునిసిపల్ కార్పొరేషన్ (1955) ప్రకారం క్రొత్త రూల్సు చేయవలసివచ్చింది చేశాము క్రొత్త చట్టం ప్రకారం రూల్సును గెజెటులో publish చేశాము గత సంవత్సరం మార్చి నెలలోనే వాటిని ఇప్పుడు approve చేయమని కోరుతున్నాను

*Mr Speaker* Motion moved

శ్రీ వి విశ్వేశ్వరరావు (మైలవరం) —మార్చిలో ప్రకటించినారు అంటున్నారు ఇప్పుడు అసెంబ్లీ ముందు ఉంచి, చర్చించకుండా, ఆమోదింపు చేయమనడం సరియైనది కాదు

మిస్టర్ స్పీకర్ —అంటే దీనిమీద రూల్సు ఇదివరకే సెక్షన్ 585 (3) క్రింద ప్రచురించబడ్డాయి దీనిపై ప్రొసీజరు ఏమిటి?

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి —ప్రొసీజరు ఏమీ లేదు ఇవి formal things ఇదివరకు Profession Tax ఉండేది వెనుకటి చట్టం క్రింద Rules ఉండేవి ఇప్పుడు క్రొత్త చట్టం క్రింద రూల్సు చేయవలసి వచ్చింది చేస్తున్నాం అంతకంటే దానిలో ఏమీ లేదు 55 సెక్షన్ ప్రకారం ముందు గెజెటులో పబ్లిష్ చేసి తరువాత అసెంబ్లీ ముందు పెట్టాలి గెజెటు పబ్లికేషను 28–3–57 న జరిగినది

మిస్టర్ స్పీకర్ —ఎప్పుడు?

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి —28–3–57న అయిందండి తరువాత అసెంబ్లీకి పంపించాము తరువాత అసెంబ్లీ లేకపోవడం జరిగింది. అందుకోసం యిప్పుడు వస్తోంది

మిస్టర్ స్పీకర్ —దానికి ఆక్షేపణలు తెలుపమని పంపించారా?

శ్రీ కె యల్ నరసింహారావు (ఎల్లందు—జనరల్) —28–3–57 తరువాత అసెంబ్లీ సమావేశము జరుగనే లేదా? అసెంబ్లీ ముందు ఉంచుతున్నాం అంటే ఉద్దేశ్యం ఏమిటి? ఉంచడమేనా? మాకు discuss చెయ్యడానికి అవకాశం ఇస్తారా?

*Sri K Brahmananda Reddy* That is left to the Chair

*Mr Speaker*, Sir My point is because these are the Rules under the Act for levy of Profession Tax, the Corporations would be adversely affected, if the Rules are delayed That is why I wanted these to be passed If the Opposition wants time and if the hon Speaker is willing to give time I have no objection

మిస్టర్ స్పీకర్ —అయితే అందులో ఆక్షేపణలు తెలుపుకోవాలని వ్రాశారా?

*Sri K Brahmananda Reddy* Yes, Sir But no objection has been received from anybody

మిస్టర్ స్పీకర్ —చాలా రోజుల క్రిందనే, గత సంవత్సరం మార్చి నెలలో ఈ బిల్లు నిబంధనలన్నీ ప్రచురించాము అందులోనే వ్రాశాము ఆక్షేపణలు ఏమైనా ఉన్నవారు ఉంటే తెలుపుకోవలసిందని దానిమీద ఎవరూ కూడ ఆక్షేపణలు తెలుపలేదు

కనుక ఇప్పుడు మీ ఎదుట పెట్టారు కాబట్టి వాటిని ఓటుకు తీసుకోవాలని మంత్రిగారు అంటున్నారు దానికి మీ ఆక్షేపణ ఏమిటో తెలపండి వెంకటేశ్వర్లుగారూ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) —అధ్యక్షా! వారు గజెట్‌లో ప్రచురించారు ఆక్షేపణ ఏమైనా వుంటే, అసెంబ్లీ సభ్యులే కాకుండ, ప్రజలందరూ కూడ తెలుపుకోవచ్చునని అవకాశం ఇచ్చారు ఇప్పుడు అసెంబ్లీలో మన ముందుకు వచ్చింది కాబట్టి టైము ఇచ్చి discussion చెయ్యడానికి అనుమతి ఇవ్వాలి అని యిక్కడ పెట్టగానే ఆమోదించాలి అనడానికి వీలుండదు Discussion కు టైము ఉండి తీరాలి ఎజండాలో ముఖ్యమంత్రిగారి రెండు బిల్లులు వేసుకున్నాము దీనిని ఎజండాలో వేయలేదు ఎజండాలో వేయకుండా discussion కు తీసుకోవాలని మంత్రిగారు కూడ ఆ విధంగా కోరరని అనుకుంటాను ఎజండాలో లేదు కాబట్టి discussion చెయ్యడానికి వీలు లేదు

మిస్టర్ స్పీకర్ — అట్లా అక్కర లేదు ఈవేళ కార్యక్రమంలో అది కూడా వుంది. అంగీకారం వున్నచో అవును అనడానికిగాని, సందేహంగా ఉన్నచో సవరణలు పెట్టడానికిగాని ఇప్పుడు కూడ మీకు అధికారం వుంది కావాలంటే ఇంకోపూట తీసుకుందాము అంటే దానికి అభ్యంతరం లేదు ఇప్పుడు రాకూడదనే ప్రశ్న లేదు

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి — అధ్యక్షా! ఇంకొకటి నేను మనవి చేస్తున్నాను ఈ రూల్సు మామూలుగా Profession Tax వేయడానికి ఇప్పుడు గజెట్‌లో publish చేశాము ఎవరూ దానికి ఆక్షేపణలుగాని, సవరణలు గాని పెట్టలేదు తరువాత ఎజెండాకు కూడ యిచ్చారు ఇంతవరకూ ఏ సభ్యుడు కూడ ఎమెండుమెంటు యివ్వలేదు. Move చేశాము

కాబట్టి, వారికు అధికారం వుండి, exercise చేస్తాం అనుకోవడం మంచిది కాదు ఇవి మామూలు రూల్సు అని మనవి చేస్తున్నాను

శ్రీ కె. వెంకటరావు —అధ్యక్షా! Opposition party వారు ఏమైనా అమెండుమెంట్సు యిస్తున్నట్లయితే అప్పుడు చర్చ చేయవలసిన అవసరం ఏర్పడుతుంది Motion circulate అయింది అమెండుమెంట్సు లేనప్పుడు చర్చ అక్కర లేకుండానే అను కూలంగానో వ్యతిరేకంగానో చెప్పే పక్షం ఏర్పడుతుంది గాని ఇప్పుడు దానిని యింకో రకంగా చేసే వీలులేదు

శ్రీ ఎల్. నారాయణరెడ్డి —(భువనగిరి) నిన్న మన Business Advisory Committee లో ఈ విషయం చర్చకు రాలేదు గజెట్‌లో ప్రచురించబడింది అంటే అది అసెంబ్లీ సభ్యులకు మాత్రమే కాదు ప్రజల అభిప్రాయం తెలుసుకోవడానికి కూడాను ఇప్పుడు మన ప్రింటు ప్రవేశ పెట్టారు సభ్యులు తెలుసుకోలేదు కనుక దీనిపై ఒకటి రెండు రోజులు వ్యవధి ఇచ్చి ఏమైనా సవరణలు ప్రవేశ పెట్టే అవకాశం ఇస్తే పెద్ద ఆక్షేపణ లేదు ఎందుకంటే కొంప మునిగిపోయేది నాకేమీ అగుపడలేదు అటువంటి అవకాశం కల్గజేస్తే దానిలో పెద్ద ఉపేక్షణ ఏమి యుంటుందో నాకు అర్థం కావడం లేదు ఈ విధంగా rush చేయవలసిన అవసరము ఏమి ఉందో నాకు బోధపడడం లేదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) - అధ్యక్షా! ఇదివరకొకసారి మీ దృష్టికి తెచ్చాము ఇప్పుడొచ్చిన notification ను కూడా చాలా ఆలస్యంగా తీసుకువస్తున్నారు పెట్టినే తీసుకువస్తే ఉపయోగం వుంటుంది వారు చాలా ఆలస్యం చేశారు అందువల్ల ఇప్పుడు కొంచెంగా ఆలస్యం అయినప్పటికీ పెద్దగా నష్టం ఏమీ లేదు కాబట్టి ఈ బిల్లును చర్చకు పెట్టాలని కోరుతున్నాను

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి --అధ్యక్షా! ఇది చాలా పొరపాటు ఈ బిల్లును 28 మార్చి 1957 న ప్రకటించాము దాని తరువాత public కు తెలియపర్చాలి ఆ time అయిన తరువాత Department examine చేయాలి ఏమైన ఆక్షేపణలు వస్తున్నాయా, లేదా అని Department examine చేసిన తరువాత మళ్ళీ అన్నీ పరిశీలించిన తరువాత అసెంబ్లీకి పంపాలి ఇవి అన్నీ అయిన తరువాత అక్టోబరులోనో ఎప్పుడో శాసనసభకు పంపడమైనది దాని తరువాత session లేనందువల్ల యిప్పుడు వచ్చింది. అంతే

శ్రీ ఎల్. నారాయణరెడ్డి —కొంచెం టైమ్ ఇవ్వండి ఏదైనా అవకాశం చూసి, మన Business చూసి, ఎక్కడ adjust చెయ్యవలెనో గమనించి ఆ విధంగా అవకాశం యివ్వండి పెద్ద సమస్య ఏమీ లేదు

మిస్టర్ స్పీకర్ —అలాగే కానీయండి దీన్ని గురించి వాదనలు అనవసరము. రేపో, ఎల్లుండో దీనిపై చర్చ సాగిస్తాము.

శ్రీ కె వెంకటరావు — అధ్యక్షా! వారు amendments ను ఇచ్చేవాళ్ళను కలెక్ట్ చేస్తున్నారా? అయితే ఏ rules క్రింద?

శ్రీ కె యల్ నరసింహారావు — అధ్యక్షా, శ్రీ కళా వెంకటరావుగారు ఏ rules క్రింద అవకాశం యిస్తున్నారని ప్రశ్నిస్తున్నారు సవరణ ఇచ్చే అవకాశం కల్పిస్తున్నారా? అసలు ఏ rules క్రమైతే అవి అసెంబ్లీ ముందుకు పోతున్నాయో, అవే ఒక తప్పుడు పద్ధతిలో వున్నవన్న మాట ఎందుకంటే వారు ప్రజాభిప్రాయాన్ని ప్రకటించమంటున్నారు ప్రజాభిప్రాయానికి ప్రకటించిన వ్యతిరేకంగా చేసి వాటిని అమలులోనికి తీసుకువచ్చారు వాటిని implement చేస్తున్నారు

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి — Sιrmise చేస్తున్నట్లుగా కాదంటే సమాధానం చెప్పడం కష్టం Act లోని 585 వ s cᶦιon లో గౌరవనీయ నరసింహారావు గారు సభ్యులుగా వున్నటువంటి హైదరాబాదు అసెంబ్లీలో చేసిన చట్టం ప్రకారం ముందు publish చేయాలి ఆక్షేపణలు చూచుకోవాలి తర్వాత అసెంబ్లీ ముందుపెట్టాలి అనేటటువంటి నిబంధన వుంది ఏదో ఆలస్యం చేశారని అనడం న్యాయంగా లేదని నేను మనవి చేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ — రూల్సు ప్రచురించారు వాటి మీద ఆక్షేపణలు వస్తే వచ్చాయి, లేకపోతే లేదు పోయాయి అవి ఇక్కడ అసెంబ్లీకి సంబంధించినటువంటివేమీ కావు ఈ రోజున ఇక్కడకు తీసుకు వచ్చారు ఈనాడు సమావేశం వారు దానిపై సవరణలు తీసుకురావడానికి ఎవరికైనా హక్కు వుందా? లేదా? అనేది ప్రశ్న హక్కు వున్నా లేకపోయినా time యివ్వడానికి నాకు హక్కు వుంది గనుక నేను ఎల్లుండి వరకు వ్యవధి ఇస్తున్నాను ఈలోగా ఏమైనా సవరణలుంటే యివ్వండి వెంటనే ఒక పూటలోనో గంటలోనో పూర్తి చేద్దాం ఉపన్యాసాలకు ఎక్కువ అవకాశం యివ్వను ముందుగనే చెబుతున్నాను, ఏమైనా సవరణలుంటే యివ్వండి

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి — ఎల్లుండి ప్రశ్నల గంట అయిన తరువాతనా?

మిస్టర్ స్పీకర్ — అవును

శ్రీ కె బ్రహ్మానందరెడ్డి — ఎల్లుండి కాకుండా 22వ తేదీన తీసుకుందాం

మిస్టర్ స్పీకర్ — రేపు సాయంకాలం లోగా సవరణలు పంపించండి We will take up these Rules on 22-2-1958 after Questιon Ϝour

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — నాకావిధంగా చేయడానికి అభ్యంతరం లేదు.

## The Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957

*D B Gopala Reddy* I beg to introduce the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957, and move that the Bill be taken into consideration at once

*Mr Speaker* Motion moved

డాక్టర్ బి గోపాలరెడ్డి — అధ్యక్షా ఇప్పుడు రెండు బిల్లులున్నాయి అవి రెండు కూడా ఒకేసారి చర్చకు వస్తే బాగుంటుందేమో అనుకుంటున్నాను ఈ రెండూ కూడా Motor vehicles taxation కు సంబంధించినటువంటివి మొదటి Act దాదాపు 5-6 సంవత్సరాలనుంచి అమలులో వున్నటువంటిది ఇది శ్రీ రాజగోపాలాచారిగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు మద్రాసులో 1952 వ సం లో ప్రవేశ పెట్టబడిన బిల్లు దాని మీద బస్సుల మీద సర్ఛార్జీ విధించడానికి సంబంధించింది Passengers charges మీద 5% లేకపోతే compound చేసినా Rs 12 8 0 సర్ఛార్జీ కట్టాలి అట్లాగే Goods vehicles మీద వారు charge చేసేదానిపై 3% లేక పోతే compound చేయకాని నెలకు Rs 22 8 0 యివవచ్చునని 1952 సంవత్సరంలో శాసనం చేశారు అంటే ఇక్కడ నుంచి జగ్గయ్యపేటకో లేక బెజవాడకో వెళ్ళడానికి నూరు రూపాయలు వసూలు చేస్తే దానికి 3% సర్ఛార్జీ వేస్తారని అన్నమాట మొత్తంగా ఎంత సంపాదిస్తున్నాడో దినం దినం లెక్కలు చూపించి compound చేసి నెలకు Rs 22-8-0 యిస్తారో ఈ విధంగా పన్ను వేసే అధికారం మనకు వున్నది ప్రయాణీకుల టికెట్ చార్జి మీద 5% లేక Rs 12 8 0 per seat, per quarter వేసే అధికారం మనకు మద్రాసులోను ఆంధ్రలోను కూడా వుంది ఆ పద్ధతినే ఇప్పుడు తెలంగాణాలో ప్రవేశ పెట్టాలని ఉద్దేశ్యం తెలంగాణాలో Motor Vehicles Tax చాలా తక్కువగా వున్నది ఇక్కడ ఒక బస్సుపై పన్ను నూరు రూపాయలుంటే ఆంధ్రలో 14 వందల రుపాయలు వుంది దీనికి సంబంధించిన వివరాలన్నీ రెండవ బిల్లులో చెబుతాను ఈనాడు ఆ 1,400 రూపాయలను ఒక్కసారిగా ఇక్కడ వేయాలని కాదు క్రమ క్రమంగా అదే వస్తుంది మొదటి Bill కు సంబంధించినంతవరకు ఆ నిబంధనలను యిక్కడ అన్వయింప చేద్దామని చెబుతున్నాను ఈ చట్టం ప్రకారం బస్సు ప్రయాణీకులపై యీ సర్ఛార్జీ వేయడం మా ఉద్దేశ్యం కాదని చెబుతున్నాను Goods Vehicles మీదనే 1-4-1958 నుంచి యీ సర్ఛార్జి విధించాలని యీ బిల్లు ఉద్దేశం అంటే owners యీ సర్ఛార్జీ 3% లేదా నెలకు రూ 22-8-0 చెల్లించాలి వుంటుంది ఇది మొదటిలో వుంది ఈ బిల్లు ఎక్కడ అన్వయించబడాలి, ఎప్పుడు అన్వయించబడాలో అనే విషయాలో Act ప్రభుత్వానికి exempt చేసే అధికారం కూడా ఇందులో వుంది రాష్ట్రం అంత కూడా

ఒకే రకమైన చట్టాలు అమల్లో వుండడం మంచిది ఈ బిల్లువల్ల అది నెరవేరుతుంది

శ్రీ కె యల్ నరసింహారావు — అధ్యక్షా ఇప్పుడు మన మంత్రిగారు ఒక బిల్లును ప్రవేశ పెట్టారు దానిని ఆలోచించడానికి తీసుకోవాలని చెప్పారు ఇంతకు ముందు వారు ఏమి చెప్పారో దానిని పత్రికలలో కూడా చూశాం Regional Council ను ఏర్పాటు చేయా దానిపై President గారి order కూడా అయినదని వింటున్నాము ఇటువంటప్పుడు తెలంగాణాకు సంబంధించిన Acts ఏమైనా వుంటే, పెట్టడం కాని లేకుంటే ఇక్కడి ఆర్థిక పరిస్థితులను చర్చించడానికి గాని ఆ Regional Council ముందుకు బిల్లులు తీసుకు వెళ్ళి వాటి ఆమోదం పొందిన తరువాత ఏదైనా చేస్తే బాగుంటుంది ఈ బిల్లు ద్వారా తెలంగాణా మీద కొత్త పన్నును విధించ బోతున్నారు ఇది Bus Owners కు lorry owners కు చెందవచ్చు కాక అయినప్పటికి దీన్ని Regional Council ముందుకు తీసుకు వెళ్ళే అవకాశము యివ్వకుండా, యీ Regional Council నిర్మాణానికి President గారి order అయిన తరువాత కూడా యీ పేరుతో యీ బిల్లును తీసుకు రావడం నిబంధనలకు విరుద్ధం రాజ్యాంగ విరుద్ధమని తెలుపమని అధ్యక్షులవారిని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —ఇందులోను పాయింట్ ఆఫ్ ఆర్డరు ఏమీ లేదు నా దగ్గర వున్న రూల్సు ప్రకారం ఇప్పుడు అమలులో వున్నటువంటి రూల్సు ప్రకారం అట్టిది ఏమీ లేదు రీజనల్ కమిటీ వస్తే వారికి ఉన్న అధికారాలేమిటి వారి ఎదుటకు ఏ బిల్లు తీసుకు రావాలి అనేవన్నీ ఇప్పుడు చర్చించడము తప్పు ఇప్పుడు నేనేమీ చెప్ప లేను ఇప్పుడు వున్నట్టువంటి రూల్సు ప్రకారం ఇది సరైనదే కనుక మంత్రిగారు ప్రొసీడ్ కావలసిందే

*Sri V K Naik (Sultan Bazar) Mr Speaker, Sir, I would like to say just a word, not under any cognisance of law or under pressure of any regulations As you have just now said that you would set up a Committee including two or three members of the Telangana region to frame Rules of Procedure, this could wait for reference to the Regional Council I feel that the Government also would give that opportunity to the Regional Council to consider such taxation or financial measures before they are introduced in the House, and we shall not be doing anything wrong or improper nor the Bill will be delayed longer As a matter of fact, we know, and we have been told like that, though constitutionally the Regional Council has not yet been constituted Therefore with your permission, I would say that if the Government

are bent on accepting that, I don't think we shall be causing any delay in the collection of taxes

డాక్టర్ బి గోపాలరెడ్డి —స్పీకర్, సర్, ఇది అక్టోబరులో పబ్లిష్ అయినటువంటి బిల్లు This is published on 16th October, four months ago ఇదేమీ క్రొత్తగా hurry up చేసినటువంటిది కాదు దీనినిగురించి ఎక్కువ protest రాలేదు అదిగాక రీజనల్ కౌన్సిల్ ఏదో వచ్చింది అన్నారు రీజనల్ కమిటీకి, Taxation measures కు సంబంధం వున్నదని నేను తెలుకోవటము లేదు నాకు తెలిసినంతవరకు రీజనల్ కమిటీ వచ్చేంతవరకు పన్నులు పెంచకూడదని చెప్పడానికి నిరోధించడానికి అధికారం లేదు ఇతర administration matters లో తెలంగాణాకు ప్రత్యేకంగా ఏమీ నష్టం రాకుండా చేసుకోవచ్చు గాని ఏమున్నప్పటికి Taxation Bills పెట్టుకుంటాం అంటే అవి రీజనల్ కమిటీకి పోవాలని చెప్పడానికి వీలు లేదు రీజనల్ కమిటీకి గాని మరెవ్వరికీ గాని అంత అధికారం ఇవ్వలేదు ప్రెసిడెంట్‌గారు ఇది నాలుగు నెలల క్రిందట పబ్లిష్ అయిన బిల్లు దీనిని గురించి ఎక్కడా ఆందోళన కనపడలేదు దీనినిగురించిన deputation మాకేమీ రాలేదు ఇది మద్రాసులోను ఆంధ్రలోను చాలాకాలం నుంచి అమలులో వున్న Act క్రొత్తగా తెచ్చినది కాదు కేవలం co ordination క్రింద తీసికొని వస్తున్నటువంటి బిల్లు ఇది

*Mr Speaker* My position is this I have no authority, but, if the hon Minister agrees what objection have I?

*Sri V K Naik* The hon Minister informs us that there is no such provision for consideration by the Regional Council The hon Minister is in the know of things and therefore no doubt arises But, thinking that it is also one of the subjects for the Regional Council, we felt that we can justifiably take it to the Regional Council before it is finally passed That was our surmise, as we also are not aware of the provisions of the President's Order regarding Regional Council

*Dr B Gopala Reddy* We are also anxious that taxes should be collected from 1st April 1958 and we have taken credit for it in the budget

*Sri V K Naik* We don't differ in that

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, గోపాలరెడ్డిగారు Regional Council కు ఈ బిల్లు మీద ఒక నిర్ణయము చేసే అధికారం లేదని చేసిన ఆ నిర్ణయమును, final కాదని చెప్పినారు అసలు Regional Council ఏర్పాటు చేసినప్పుడు

తెలంగాణాకు సంబంధించిన బిల్లులు ముఖ్యంగా Financial Bills చర్చించి వారి అభిప్రాయాలు తీసుకున్న తరువాత మన House ముందుకు రావాలని ఉంది ఇలాంటప్పుడు దానికేమీ సంబంధం లేనటువంటి విధంగా మాట్లాడటం సరికాదనుకుంటాను Regional Council ఎలాగూ April లో రాబోతున్నది గనుక వారి అభిప్రాయము తెలుసుకున్న మీదనే మనము దీనిని చర్చిస్తే బాగుంటుంది దీనివల్ల వచ్చే ఆదాయమ్ము, మహా వస్తే ఆరు లక్షలు అంతకంటే ఎక్కువ లేదు

డాక్టర్ బి గోపాలరెడ్డి — దీని క్రింద 19 లక్షల రూపాయల్లు వస్తుందని అంచనా వేసుకున్నాము

In the President's Order, it is stated that Bills other than money Bills affecting Telangana region and containing mainly provisions dealing with any scheduled matters will be referred to the Regional Council, it is clear that not all taxation measures will be referred to the Regional Council

*Sri Baswa Maniah (Andole)* Mr Speaker, Sir, I beg to move

"That the Bill be circulated for the purpose of eliciting public opinion"

*Mr Speaker* Motion moved

శ్రీ బసవ మానయ్య — మంత్రిగారు ప్రవేశ పెట్టిన బిల్లును నేను వ్యతిరేకిస్తున్నాను ప్రజాభిప్రాయానికి పంపాలన్న కారణాన్ని చూపిస్తున్నాను Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill 1957 ప్రకారం హైదరాబాదు రాష్ట్రంలో ఉండబడే బళ్ళకు కూడా surcharge ఇచ్చుకోవలసివస్తుంది ఆ surcharge ఇచ్చుకోడానికి ఇక్కడ పరిస్థితులను బట్టి చాలా కష్టంగా వుంటుంది ఆంధ్రలో ఎక్కడా కూడా, Toll Tax లేదు తెలంగాణా ప్రాంతంలో ప్రతి పది మైళ్ళకు Toll Gate ఉన్నది గ్రామ పంచాయతీ అయినా, Town Committee అయినా అక్కడ Toll Gate ఉన్నది ప్రతి లారీ కూడా ఎనిమిది అణాలనుంచి మూడు రూపాయల వరకు Toll Tax ఇచ్చుకోవలసి వస్తున్నది ఈ భారం ఆంధ్రలో లేదు మళ్ళీ దీనిపై ఇంకా Surcharge వేస్తామంటే ఇంకా కష్టంగా వుంటుంది దీని విషయంలో హైదరాబాదులో లారీ యూనియన్ వాళ్ళు ఎంతో ప్రయత్నము చేసి ఈ విషయాలన్నీ ప్రభుత్వానికి తెలిపి ఇక్కడనుంచి ముఖ్యమంత్రిగారితో

కలుసుకోనే ప్రయత్నము చేసినా కూడా వారికి సమయము దొరకలేదని తెలుపు కొన్నారు హైదరాబాదు Motor Vehicles విషయంలో నూటికి మూడు వంతుల Tax హెచ్చింపబడుతున్నది. ఇక్కడి తారీఖు హెచ్చు కావడంచేత వారు భరించుకోలేని పరిస్థితులలో యున్నారు ప్రభుత్వము ఈ Act ను ఎప్పుడైతే రాష్ట్రం అంతటా కూడా వర్తింప చేస్తుందో అప్పుడు Toll Gate Tax తెలంగాణాలో ఉన్నదానిని తీసి వెయ్యవలసి ఉండేం ఆ విధంగా చెయ్యలేదు

మిస్టర్ స్పీకర్ —రెండవ బిల్లు మాట యిప్పుడు ఎత్తుకోకండి దీనిమట్టుకు కానియ్యండి

శ్రీ బసవమానయ్య —ఇంతబరువు పడుతుందని తెలుపడానికి చెప్పాను!

మిస్టర్ స్పీకర్ —కాబట్టి ప్రజాభిప్రాయానికి పంపించ మంటారా?

శ్రీ బసవ మానయ్య —దీనిని గురించి protest కాలేదన్నారు మంత్రిగారు గాని ప్రత్యక్షంగా తెలంగాణా ప్రాంతము చేయడంలో protest జరిగింది Motor union వాళ్ళు Represent చెయ్యడానికి ప్రయత్నించారు వ్రాత మూలకంగా తెలుపుకున్నారు వారి కష్టాలన్నీ చూపించారు Toll Tax ద్వారా రోజుకు 0–8–0 అణాలనుంచి నాలుగు రూపాయల వరకు, వేరే ఎన్నో కట్నాలు ఖర్చులు రోజూ తగులుతూ ఉంటాయి! ఈ కారణాలనుబట్టి దీనిని తప్పక ప్రజాభిప్రాయానికి పంపించాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ —ప్రజాభిప్రాయానికి పంపవలెనన్న విషయంలో దీనిని ఓటుకు తీసుకుంటాను ఎవరైనా మాట్లాడేవారుంటే మాట్లాడ వచ్చు

శ్రీ బి శంకరయ్య —అధ్యక్షా! ప్రజాభిప్రాయమునకు పంపాలనే సవరణను బలపరుస్తూ న్నాను ఇకముందు ఏ చట్టం వచ్చినప్పటికీ, అనగా తెలంగాణాది ఆంధ్రది, సమన్వయంచేసే టప్పుడు అన్ని విషయాలను దృష్టిలోపెట్టుకొని సమగ్రమైనటువంటి చట్టమును తెస్తామని ఎప్పటికప్పుడు అసెంబ్లీలో ప్రకటనలు చేస్తున్నారు కాని చట్టం తెచ్చేటప్పుడు మాత్రం ఆ సమన్వయం ఏమీజరుగడంలేదు ఇప్పుడు తీసుకుని వచ్చినటువంటి బిల్లు లోనే ఎన్నోలోపాలు న్నాయి ఇక్కడ టోలుగేట్సు ఉన్నాయని ప్రభుత్వానికి తెలుసును అటువంటి పరిస్థితులలో ఒక సమగ్రమైన చట్టమును తీసుకరావలయును రెండు చట్టాలనుకలిపి సమగ్రమైన చట్టమును ఒకటిగా చేసేటప్పుడు ఏఏ పన్నులు ఏ ఏ ప్రాంతములో ఎలాయున్నవి విచారించి హెచ్చించవలసిన చోట హెచ్చించడంగాని, తగ్గించవలసిన చోట తగ్గించడంగాని చేయాలి అలాంటివి ఏమీ లేకుండా ఎప్పటికప్పుడు కొంత ఆదాయాన్ని సంపాదించాలనే దృష్టితోనే బిల్లులు తీసుకొనిరావడం

సబబుకాదు అసలు దానివల్ల ఏ విధముగాను లాభముండదు అచ్చటయిచ్చట ఉండేటటువంటి పరిస్థితులు ఈ మార్పులు ద్వారా ఎలావిషమిస్తుంటవో గమనించరు ఇప్పుడుముఖ్యంగా గమనించవలసిందేమిటంటే ఇచ్చట Regional Council ఎర్పడబోతుంది అటాంటప్పుడు దీనికి సంబంధించి వారు అనేక సలహాలు ఇవ్వవచ్చును అందువల్ల ఈ రెండు చట్టాలను సమన్వయంచేసేటప్పుడు అన్ని విషయములను సమగ్రంగా చర్చించాలి ఈ చట్టం తీసుకు వచ్చేటప్పుడే ప్రయాణీకులమీద ఏ మాత్రం ఈ సర్చార్జీపడబోదని ఆంధ్ర ప్రభుత్వం గూడా హామీ ఇచ్చింది కాని అనేకచోట్ల బస్సు యజమానులు, లారీ యజమానులు ఈ సర్చార్జీని ప్రజల దగ్గర వసూలుచేసినటువంటి సందర్భాలు ఎన్నో ప్రభుత్వ దృష్టికి వచ్చాయి ఆ విధంగా ఇప్పుడు గూడా చాలాచోట్ల వసూలుచేస్తున్నారు ఇప్పటికే తెలంగాణాలో ప్రయాణీకుల దగ్గర వసూలుచేసే రేట్లను చూచినట్లయితే ఆంధ్రలోకంటే చాలా హెచ్చుగాయున్నవని ప్రభుత్వానికి గూడ తెలుసు అచ్చటికన్నా గూడా ఇచ్చట రెండురేట్లు ఎక్కువ ఉన్నాయన్నా ఆశ్చర్యంలేదు పూర్వలెక్క ప్రకారం చూచుకుంటే ఆంధ్రలో ఏడున్నర పైసలుంటే వీరికి తెలంగాణాలో పదకొండు పైసలుండేది అందువల్ల ఇప్పుడు తెచ్చేటటువంటి చట్టమును ఇచ్చట అనువర్తింప చేయడంలో ఇక్కడి ప్రయాణీకులమీద ఈ సర్చార్జీ పడకుండా చట్టములో ఏమైనా హామీ ఇచ్చిందా అంటే అటువంటిదేమీలేదు ఇదివరకు ఆంధ్రలో ఊరకేయిచ్చిన హామీ అమలుజరుగలేదు అక్కడ ఆంధ్ర జిల్లాలలో ప్రయాణీకుల సామానులమీద ఈ సర్చార్జీని చాలాచోట్లవసూలు చేస్తున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఈ సర్చార్జీ ఒక్క ప్యాసింజరు ఫెయిర్సుమీదనే గూడ్సు మీద ఎందుకులేదో కారణం రెండవ బిల్లుమీద మాట్లాడునప్పుడు చెప్పుతాను

శ్రీ బి శంకరయ్య —ఏరోజు డబ్బు తీస్కుంటే ఆరోజునుంచే వసూలు చేయవచ్చును ఈ బిల్లును సవరించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది ఇంకా ప్రయాణీకులమీద పలుచోట్ల ఈ సర్చార్జీ వసూలుచేస్తున్నారు ఎక్కడో మద్రాసులో ఈ బిల్లును ప్రవేశపెట్టేటప్పుడు ఇచ్చినటువంటి హామీని ఇప్పుడు నిలబెట్టుకోనక్కరలేదు అంటున్నారు ఆ విధంగా బిల్లులో ప్రావిజన్ కలుగచేయడానికి వీలున్నప్పుడు, ఈ బిల్లును మళ్ళీ పరిశీలించి ప్రయాణీకులమీద భారం పడకుండా ఉండేటట్లుగా దానిని సమగ్రంగా ఎందుకు తీసుకురాకూడదో నాకు అర్థం కావడం లేదు ప్రస్తుతం ఉన్నటటువంటి టోల్‌గేట్లన్నీ ఎందుకుతీసివేయకూడదు ? ఇవి అన్నీకూడ సమగ్రంగా ఆలోచించడానికి సావకాశంయివ్వాలి ప్రభుత్వం యింత తొందరపడి బిల్లుతీసుకుని రావలసిన అవసరమేమీ కనుపించడంలేదు దీనిని public opinion కు పంపించినప్పుడు అన్నివిషయాలను గూడ సమగ్రంగా ఆలోచించుకొని మనము మే నెలలోనో, జూన్ నెలలోనో చట్టమును చేసుకోవచ్చును ఈ ప్రతిపాదనకు అంగీకరించవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను

శ్రీ బసవ మానయ్య —ప్యాసింజర్లమీద సర్చార్జీవేసే ఉద్దేశ్యమే లేనప్పుడు ఈ బిల్లులో ఆప్రొవిజన్ ఎందుకు తీసుకురాలేదు ?

శ్రీ వి విశ్వేశ్వరరావు — ఈ బిల్లు శాసనసభ ముందు వుంది కాని ప్రభుత్వానికి డబ్బు కావలసివచ్చినప్పుడల్లా ఒక బిల్లును తీసుకరావడం ఆచారంగాయుంది ఇదివరకు ఆంధ్రలో మద్రాసు శాసనం హైదరాబాదులో హైదరాబాదు శాసనం అమలులో ఉండేది ఆంధ్రలో 450 రూ లు తెలంగాణాలో 120 రూ లు చొప్పున వసూలుచేస్తున్నారు కొన్ని లారీలకు రెండుచోట్లకూడ రెండు చట్టాల ప్రకారం పన్ను వసూలుచేశారు ఇదికాకుండా Toll Tax అని బెజవాడనుంచి హైదరాబాదుకువచ్చే లారీలకు 3–7–0 వసూలు చేస్తున్నారు ఒక ప్రక్కన 450 రూ లు వసూలు చేస్తూ రెండవ వైపున 3–7–0 లు వసూలు చేస్తున్నారు Toll Gate Tax చాలా ఎక్కువగా ఉన్నది అది పది మైళ్ళకు ఒక చోట గూడవుందని చెప్పుతున్నారు ఆంధ్ర రాష్ట్రంలో Toll Tax తీసివేశారు దానివల్ల పన్నులు పెంచావని చెప్పారు కాని ఇక్కడ Toll Gate Tax వున్నది అయినా పన్నులు పెంచుతున్నారు ఈ బిల్లును తప్పకుండా ప్రజాభిప్రాయానికి పంపవలసిన అవసరం ఉన్నది ఆంధ్ర ప్రాంతంలో 450 రూ ల ట్యాక్సుయున్నది కాని ఏ రాష్ట్రములో గూడా యింత ట్యాక్సు లేదని మన ప్రభుత్వానికి తెలుసుననుకొంటాను ఒరిస్సాలోకాని, బొంబాయిలోగాని మధ్యప్రదేశ్‌లోగాని, మైసూరులోగాని ఎక్కడ చూచినగూడా 450 రూ లు లేదన్నీ మూడువందలలో మూడువందల యాభై రూపాయలలో మాత్రం వుందని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను తెలంగాణాలో R T D బస్సులు వుండడమువల్లనే ప్రయాణీకుల మీద పన్ను పడడంలేదు కాని యిప్పటికే R T D బస్సులలో రేట్లు ఎక్కువగావున్నాయి ఆంధ్రకు పోల్చిచూస్తే, అక్కడ మైలుకు ఎడు పైసలు, ఇక్కడ పదకొండు పైసలువుంది ఇది చాలా ఎక్కువ అలాంటప్పుడు ఇక్కడ సర్చార్జీలేదని ప్రభుత్వం వుదారంగా ప్రకటించడం మాత్రం చాలదు ప్రభుత్వం ప్రతి ప్రత్యేక పన్నుల బిల్లుతెస్తూ, వాటిని పెంచుకొంటూ పోవడం సరియైనది కాదు అందువల్ల దీనిని ప్రజాభిప్రాయానికి పంపాలని కోరుతున్నాను

శ్రీ కె యల్ నరసింహారావు — గూడ్సు మీద కూడా సర్చార్జీ వేయడానికి ప్రయత్నం చేస్తున్నారు ఐతే ప్రభుత్వాన్ని ఒక్క విషయమలో నైనా న్యాయంగా ప్రవర్తించేటట్లు చేద్దామని నేను Point of Order ను raise చేసే ప్రయత్నం చేశాను కాని ఏ కారణంవల్లనైతేనేమి నా Point of Order ను అంగీకరించలేదు రూల్సు ఒప్పుకోవడంలేదన్నారు కాన్స్టిట్యూషన్‌కు విరుద్ధంగా

మిస్టర్ స్పీకర్ — Point of Order మాట, Constitution మాట, ఎత్తుకోకండి

శ్రీ కే యల్ నరసింహారావు — Constitution లో లభించిన అవకాశం రూల్సులో లేదని రిజెక్టు చేస్తున్నారు

శ్రీ యం నాగిరెడ్డి (మాచెర్ల) — అధ్యక్షా! ఈ బిల్లును తీసికొని వచ్చేటప్పుడే Objects and Reasons తోనే అదనపు ఆదాయాన్ని కలిగించుకొనేందుకు ఈ బిల్లు

తెస్తున్నామని వ్రాశారు ఈ అదనపు ఆదాయాన్ని passengers మీద మాత్రం పడకుండా చూస్తామని వ్రాశారు ఈ అదనపు ఆదాయాన్ని పొందడానికి వచ్చేటటువంటి ప్రతి బిల్లులో నూ "Deficit Budget, అదనపు ఆదాయం" అను రెండు మాటలు వ్రాయడం మామూలై పోయిందనుకోండి ప్రతి సమావేశంలోను వచ్చినటువంటి అన్ని బిల్లుల సమయంలోనూ రెండు ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని యూనిఫార్మిటీని తీసుకరావలసిన అవసరాన్ని తెలియజేస్తూవచ్చారు రెండు ప్రాంతాలలోనూ రెండు రకాలుగా పన్నులు ఉండకుండా చేయాలి అక్కడవున్న యిబ్బందులను తగ్గించి, ఇక్కడ వున్న యిబ్బందులను తొలగించాలి పన్నులను తొలగించడానికో, యూనిఫార్మిటీని సాధించడానికో చేసేదానికిబదులు ఎప్పుడు చూచినా ఎక్కడ ఎక్కువ పన్నున్నదో చూచి దాని స్థాయికి పన్నులు పెంచడం జరుగుతున్నది. ఇప్పుడిక్కడ మైలుకు 11 పైసలు వుండేదానిని తగ్గించి 7న్నర పైసలు స్థాయికి తెచ్చేటందుకు యీ బిల్లు చేశారా? అంటే లేదు గౌ మంత్రిగారు ఈ బిల్లు చాలా న్యాయమైనటువంటి దంటున్నారు ఈ బిల్లు ఏమీ క్రొత్తదీ కాదని చాలా సౌమ్యంగా చెబుతున్నారు మా పూర్వానుభవమునుబట్టి చూస్తే మళ్ళీ ఇటువంటి బిల్లులు ఎన్ని తేబోతున్నారో మాకు తెలియదు గతములో కర్నూలు ఎసెంబ్లీలో సర్‌చార్జి బిల్లు తీసుకొని వచ్చినప్పుడు దానిలో ఏమి ప్రమాదము లేదు గనుక ఒప్పుకొనమన్నారు వారు చెప్పిన ప్రకారం ఆ బిల్లు ఆ ఒక్క సంవత్సరానికని ఒప్పుకుంటే ఆంధ్రప్రదేశ్ వచ్చిన తరువాత దానిని ఎప్పటికీ కూడ జరగనిస్తే పెంచిదన్నారు అదేవిధముగా ప్రస్తుతానికి ఈ సర్‌చార్జి లారీలమీద వేస్తున్నామని మంత్రిగారు నొక్కి నొక్కి చెప్పారు ఇప్పటిలో మాత్రమే దీనిని వేస్తున్నాము అని రెండు మాట్లు అన్నారు ఆ "ఇప్పటిలో" అనేదానికి అర్థము ఏమిటో మనకు ఇప్పుడే తెలిసి పోతున్నది రెండింటిమీద ఒకేసారి పన్నులు విధిస్తే ఎక్కడ ఆందోళన చేస్తారో అని ఇప్పటికీ లారీలమీద మాత్రమే వేస్తున్నామన్నారు ప్రభుత్వం ఇప్పటిలో ప్యాసింజర్సు మీద పన్ను విధించ దలచని పక్షములో ఆ విధముగా దానికి Exemption యిచ్చినాము అనే క్లాజు ఎందుకు పెట్టరు? మేమే అధికారములో వుంటాము కాబట్టి రూల్సు వచ్చేటప్పటికి మాత్రము తీసివేస్తాము అనే దృష్టితో మాట్లాడుతున్నారు ఇప్పుడు ఈ బిల్లు లారీలకు సంబంధించినదై యున్నప్పటికీ బడ్జెటు సమావేశము పూర్తి కాగానే తెలంగాణాలో బస్‌మీద 11 పైసలున్నాయని ఆంధ్రలో మనకు $7\frac{1}{2}$ పైసలు వున్నాయని యీ రెంటిని సమన్వయం పరచడానికి మరొక బిల్లు తేస్తె తేవచ్చును అప్పుడు తెలంగాణావార్లు ముభావముతో వూరుకుంటే యీ విధముగా, బ్రిటిషు వారు విభజించి పరిపాలన చేసినట్లుగా తెలంగాణాలో తక్కువగా వుంటే అది ఆంధ్రలో వున్న పన్నుతో సమానము చేయుడము ఆంధ్రలో తక్కువవుంటే దానిని తెలంగాణాలో ఉన్నదానితో సమన్వయం చేయుడము జరుగుతున్నది ఇదేరకంగా తడవుకొక బిల్లు తెస్తూ సమానత్వం అనే పేరుతో పన్నులు ఎక్కువ చేయబోతున్న విషయము స్పష్టముగా కనబడుతున్నది అయితే ఈ విధముగా ప్రతి బిల్లు వచ్చేటప్పుడు మన ప్రభుత్వము చేస్తున్నట్లు మనకు కనబడుతున్నది పన్నులన్నింటిని యిదే దృష్టిలో పెట్టుకొని అభివృద్ధి చేయడము జరుగుతున్నది లైసెన్సు ఫీజు ఆంధ్రలో ఎక్కువగా వుందని మంత్రిగారు చెప్పారు అందుచే మోటారు వెహికల్స్ టాక్సేషన్ మీద మళ్ళీ 16వ నెంబరు బిల్లు రాబోతున్నది ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువ వుందీ ఇక్కడ తక్కువగా వుందని ఆ స్థాయిలోకి దీనిని కూడ తీసికొని

పెళ్ళామని ఇక్కడ వారిని 33⅓% పెంచుతూ ఒక బిల్లును తెస్తున్నారు ఇది చాలా స్వల్పమైనదని మనకు మంత్రిగారు చెప్పినారు ఈ బిల్లుకు ప్రజలు ఎవ్వరు వ్యతిరేకించ లేదని చెప్పారు ఈ బిల్లును ఆంధ్రప్రదేశ్ గెజెటులో ఇంగ్లీషులో ప్రచురించినారు ఇది ఇంగ్లీషులో ఉండి కాబట్టి ఎవరికి తెలియదు ఎంతమంది ప్రజలు గెజెటు చూచి వుంటారన్నది ఆలోచిస్తే ఈ బిల్లును ప్రజాభిప్రాయ సేకరణకు పంపవలసి వున్నది అట్లా పంపి నప్పుడు మంత్రివర్గానికి ఎన్ని పిటిషన్లు, ఎన్ని మెమొరాండాలు ఎన్ని రాయబారాలు వస్తాయో తెలుస్తుంది అప్పుడు వాస్తవముగా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొనడం అవుతుంది అంతేగాని ఇంగ్లీషులో Gazette లో ప్రచురించినామని ప్రజలనుంచి ఎవిధమైన వ్యతిరేకం రాలేదని చెప్పడము సబబుగాదు అందుచేత దీనిని ప్రజాభిప్రాయానికి పంపడము చాలా అవసరము ఎప్పటికప్పుడు ఏదో పన్ను పెంపులో లడవున కొంతసారి Amendment తీసుకురావడము సరియైనది కాదు దీనిని ప్రజాభిప్రాయానికి పంపే విషయాన్ని గురించి గౌ మంత్రిగారిని పరిశీలించమని నేను తమ ద్వారా కోరుతూ ముగిస్తున్నాను

శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోలు) —అధ్యక్షా! ఆంధ్రలోవున్న టాక్సులతో సమానంగా తెలంగాణాలో కూడ చేయాలని ప్రభుత్వము యీబిల్లు ద్వారా ప్రయత్నము చేస్తున్నది తెలంగాణాలో ఎక్కువ పన్నువుంటే దానిస్థాయికి ఆంధ్రలో కూడ ఎక్కువ చేయడము, అలాగునే ఆంధ్రలో పన్ను ఎక్కువవుంటే తెలంగాణాలో పన్ను యెక్కువచేయడము చూస్తే "రెండు పిల్లులమధ్య ఒకకోతి యేవిధముగా పంచి మోసముచేసిందో, అదేవిధముగావుంది ఈ పన్ను భారము వ్యాపారులమీదకాని యింకొకరిమీదగాని వేయలేదని యిప్పుడన్నారు ఇప్పుడు లారీలపై పన్ను యెక్కువ చేసినారు కాని ఒకరైతు లారీపైని వస్తువులు తీసుకొని పోయాడంటే లారీవారు కూడ ఆ రైతునుంచి ఎక్కువ కిరాయి వసూలుచేస్తారా తక్కువచేస్తారా? ఏదైన Tax ఎక్కువగా పెంచినప్పుడు యిప్పుడున్న డబ్బుకాక రెండింతలు తీసుకుంటున్నారు ఇటువంటిదానికి నిర్బంధము లేదు మొత్తానికి యీ పన్ను ప్రజానీకముపైనే పడుతున్నది అందుకే ఈ బిల్లును ప్రజాభిప్రాయసేకరణకు పంపవలసిన అవసరము కలదు ఉదాహరణకు ఒక రైతు ఒకలారీ హైదరాబాద్‌నుంచి నిజమాబాద్‌కు కిరాయికి మాట్లాడినాడనుకుందాము లారీపై పన్ను యిప్పుడు యెక్కువ చేయడముచేత ఆలారీ యజమాని ఆ పన్ను డబ్బును రైతునుద్దనుంచే వసూలుచేస్తాడు ఆ విధముగా ఎవరుతీసుకొనరని అనలేముగదా? ఈ పన్ను భారము ఎవరిమీద పడబోతున్నదో నాకు అర్థము కావడములేదు ఇంకొక విషయమేమంటే—ఆంధ్రలో అక్కడక్కడ రోడ్లు, త్రోవలు సరిగానేవున్నవి ఇక్కడ తెలంగాణాలో సాధారణంగా రోడ్లు సరిగాలేనందున, ఒక గ్రామమునుంచి మరొక గ్రామానికి పోవడానికి రోడ్లునూ, లారీల యజమానులుగాని ఒక సర్వీసును నడిపించుకొనేవారుగాని సరిచేసుకొనడము జరుగుచున్నది ఇందువల్ల లారీ, బస్ యజమానులకు ఖర్చులు యెక్కువగా పెరిగినవి దీనికితోడు యిప్పుడు యీ పన్నును పెంచడములోని సబబు నాకేమి బోధపడలేదు అదియునుగాక ఆంధ్రలో గ్రామపంచాయితీలుగాని డిస్ట్రిక్ట్ బోర్డువారుగాని అక్కడక్కడ రోడ్లకు మరామతు చేస్తూవున్నారు కాని తెలంగాణా ప్రాంతంలో లారీలు నడిపించుకొనేటటువంటి వారుగాని, బస్ సర్వీసు నడిపించుకొనేవారుగాని యీ త్రోవలను, రోడ్లను బాగుచేయించుతూవున్నారు అందుచేత వారికి అమితమైన ఖర్చులు అవుతున్నాయి మొన్ననే మంత్రివర్గ సమావేశమొకటి జరిగినది ఎక్కడెక్కడ అయితే టాక్సులు ఎక్కువగా వున్నాయో వాటిని తక్కువచేసేటందుకు తగిన ప్రయత్నముచేయడానికి బదులు, పన్నును ఎక్కువ

స్థాయికి పెంచుతూ యిప్పుడు మళ్లీ యీ బిల్లును తీసుకొనిరావడము సమంజసముగాలేదు అందుచేతనే దీనిని ప్రజాభిప్రాయానికి పంపాలని నేను కోరుతున్నాను

శ్రీ కె సుదర్శనరావు (పాల్వంచ) అధ్యక్షా, ఈ బిల్లు గత 16 అక్టోబరు గెజిట్‌లో అచ్చువేయబడినది అక్టోబరు 16న గెజిట్ చేయబడినప్పటికీ యీ బిల్లు యింగ్లీషులో గెజిట్ చేయబడినదనిన్నీ, ప్రజలలో చాలా మందికి యింగ్లీషు రాదనిన్నీ అందుచే దీనిపై ప్రజాభిప్రాయ సేకరణకు అవకాశము చిక్కలేదనిన్నీ అనడము యేమంత సమంజసముగాలేదు ప్రజలు యింగ్లీషు చదువుకున్నవారు కాకపోవచ్చును కాని యీ బిల్లు విషయాలను గౌరవనీయులైన సభ్యులు చర్చించబోతున్నారు సభ్యులు యీ విషయములో శ్రద్ధవహించి వుంటే ప్రజలకు దానిని గురించి తెలియజేయాలి ఈ విషయాలన్నీ ప్రజలకు తెలుపుదామన్న అభిలాష కలిగినవారు, వారికేమైన అభ్యంతరములున్నట్లయితే, వారు పత్రికా ముఖముగాగాని లేక వేరే విధముగాగాని ప్రజలకు యీ విషయము తెలియజేసి వారి అభిప్రాయాన్ని కూడ ప్రభుత్వ దృష్టికి తీసుకొని రావచ్చు కాని 4—5 నెలల సమయము చిక్కిన తరువాత కూడా యింతవరకు చర్య తీసుకోనటువంటి సభ్యులు యిప్పుడు యింకొకటి, రెండు నెలలు అవకాశము యివ్వవలసినదిగా కోరడము రైలు దాటి పోగానే (బస్‌మిస్ చేసిన తరువాత) పశ్చాత్తాపముపడడముగానే వుంటుంది అసలు యీ బిల్లు యొక్క బాగోగులను మాకు చెప్పలేదు తెలంగాణా ప్రజలకు యీ బిల్లుతో యేమైనా మేలు కలుగుతుందా ? లేక దానితోటి నష్టము కలుగుతుందా ? ఈ విషయాన్ని బిల్లు చర్చకు వచ్చినప్పుడు సహజముగా మనము చర్చించవచ్చును తెలంగాణా ప్రజలకిది నష్టదాయకముగా వుంటే దీనిని మనము వద్దనుకోవచ్చును తెలంగాణా ప్రజలకు యిది లాభదాయకముగా వుంటే యిది మనము కావాలనుకోవచ్చును కాని యీ బిల్లును మళ్లీ ప్రజాభిప్రాయసేకరణకు పంపితే యిప్పటికే ఆసల్యమయిన బిల్లును మరింత ఆసల్యముచెయడానికి తోడ్పడుతుంది తప్పితే వేరే దీనిలో ఏమి లాభము కలుగదు ఇప్పటికే చాలా కాలము అయినందున దీనిని ప్రజాభిప్రాయ సేకరణకు పంపనవసరములేదు కాబట్టి దీనిని యిప్పుడు చర్చకుతీసుకొని దీనిలోని బాగోగులన్న చర్చించి యిది మనకు అవసరమా లేదా, ప్రజలకు దీనివల్ల లాభము కలుగుతుందా లేదా, అన్న విషయము చర్చించి ఉచితమని తోస్తే దీనిని ప్యాసుచేయవచ్చునని నేను అభిప్రాయపడుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఈ బిల్లును ప్రత్యేకముగా ప్రజాభిప్రాయసేకరణకు పంపించ నవసరములేదు ఈ బిల్లు కొత్తదేమీకాదు మద్రాసులోగాని ఆంధ్రలోగాని అయిదు సంవత్సరములనుంచి పరిశీలింపబడి ప్రజల యొక్క ఆమోదాన్ని పొందినటువంటి బిల్లేగాని కొత్తగా వచ్చినటువంటి బిల్లు కాదిది ఇది గాక ఈ బిల్లును గత సమావేశంలోనే ప్రవేశపెట్టుటకు ప్రయత్నముచేశాము కాని అప్పుడు సాధ్యముకాలేదు ఈ బిల్లును బడ్జెటుకు ముందే తీసుకొని రావడానికి కారణమేమంటే బడ్జెటు మూలాన మార్చిలో దేనికి అవకాశమువుండదు ఈ బిల్లు యిప్పుడు ప్యాసయితే యిది యీ ఏప్రిలు ఒకటవ తేదీనుంచి అమలుకువస్తుంది దీనివల్ల ప్రభుత్వానికి సంవత్సరానికి 9 లక్షల 91 వేల రూపాయిలు ఆదాయము వస్తుందని అనుకుంటున్నాము ఇది Tax కు సంబంధించిన విషయముకాదు Taxation రెండవ బిల్లులో వస్తుంది ఇది "Surcharge on goods" అంటే 3% వంతున సర్‌చార్జి

యివ్వండి లేకపోతే లారీ క్కొటికి నెలకు రు 22-8—0లు (బహుశా దినానికి 0-12-0 అవుతుందేమో) చొప్పున అయినా యివ్వండి ఈ విధముగా యిస్తే ప్రభుత్వానికి ద్రవ్య ఆదాయము వస్తుందన్నమాట లారీవాళ్లు పెద్దపెద్ద వ్యాపారాలుచేసి ఎంతో సంపాదిస్తున్నారు ఎంతో పెట్టుబడి పెట్టుతున్నారు అటువంటప్పుడు అదనంగా నెలకు రు 22-8-0 యిచ్చినంత మాత్రాన నష్టమేమి లేదు తెలంగాణాలో అంతా కలసి 9 లక్షలు 91 వేల రూపాయలు (పూర్తిగా 10 లక్షలు కూడ కాదు) వస్తుంది ఇటువంటిదాని విషయంలో ప్రతిపక్ష నాయకులు సోదరులు యీ లారీవాళ్లపైన బస్సువాళ్లు పైన ఎంత సానుభూతితోవున్నారో తమకు తెలుస్తున్నది పేదవాళ్లు పేదవాళ్లు అంటూనే కలవాళ్ల మీద పన్ను వేస్తుంటే దానిని ప్రతిఘటించడం జరుగుతున్నది

శ్రీ ఆర్ నారాయణరెడ్డి ఈ పన్ను బస్ యజమానుల మీద ఎన్నడూ పడదు ఇది ఇన్‌డైరెక్ట్ టాక్స్ (Indirect tax) సామాన్య ప్రజలమీద పడే పన్ను అని నా స్పష్టమైన అభిప్రాయం

డాక్టర్ బి గోపాలరెడ్డి లారీ యజమానులు సామాన్య ప్రజలకన్న కొంచము మెరుగైన స్థితిలోఉన్నారు లారీని పెట్టుకోవాలంటే 25 వేల రూపాయలవరకు కావలసి ఉంటుంది ఆ విధముగా పెట్టుబడి పెట్టుకొని వారు వ్యాపారముచేస్తున్నారు లారీ రూట్సుకొరకు 'మాకివ్వండి' 'మాకివ్వండి'అని ఎన్నో వందలమంది అప్లికేషన్లు పెట్టుకుంటున్నారు ఈ కొత్త సర్‌చార్జి వల్ల రోజుకు రు 0-12-0లు మాత్రమే అదనపు చార్జి విధించబడుతుంది అంటే నెలకు రూ 22-8-0 మాత్రమే ఇదైనా 50 మైళ్లలోపు రూట్సులో నడిచే లారీలకు వర్తించదు ఏప్రిల్ 1వ తేదీ నాటికి ఈ పన్ను అమలులోనికి రావలెను కనుక దీనిని యిప్పుడు ప్రజాభిప్రాయానికి పంపించడం సమంజసంకాదు అందువల్ల ఈ సవరణను నేను ఆమోదించలేకపోతున్నాను

*Mr Speaker* The question is

"That the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957 be circulated for eliciting public opinion"

The motion was negatived

*Sri R Narayana Reddy* I beg to move

"That the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957, be referred to a Select Committee"

*Mr Speaker* Motion moved

శ్రీ ఆర్ నారాయణరెడ్డి — ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపి ఉంటే బాగుండేది అయితే దానికి మంత్రిగారు అంగీకరించలేదు కనీసం సెలెక్టు కమిటీకి పంపించడం అవసరం ఇది టాక్సేషన్‌కు సంబంధించిన విషయం కనుక, యిందుకు అంగీకరిస్తే చాలా బాగుంటుందని అభిప్రాయపడుతున్నాను ఎక్కువ కాలం కూడా పట్టదు. 2, 3 రోజులలో సెలెక్టు కమిటీ దీనిని పరిశీలించవచ్చు కాబట్టి ఈ సవరణను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్-జనరల్) — ఈ మధ్య కమ్యూనికేషన్స్ అండ్ ట్రాన్స్‌పోర్టు శాఖలమంత్రుల సమావేశం జరిగినపుడు రైల్వేస్ ద్వారా సరకుల రవాణా త్వరగా జరగడంలేదని, సమ్మర్దం ఎక్కువగా ఉన్నదని, కాబట్టి ట్రాన్స్‌పోర్టును అభివృద్ధిచేయాలని భావించినట్లు తెలిసింది అయితే యిందుకు ప్రతిబంధకంగా కొన్ని రాష్ట్రములలో హెచ్చు పన్నులు ఉన్నాయని, వాటిని యూనిఫారమ్‌గా విధించడం అవసరమని తలచినట్లు కూడా నేను పత్రికలలో చూచాను

తెలంగాణాకు సంబంధించినంతవరకు పన్నులు తక్కువగా ఉన్నవని, ఆంధ్రలో ఎక్కువగా ఉన్నవని కొన్ని అంకెలు యిచ్చారు అయితే పరిస్థితులు కూడా వేరుగానే ఉన్నాయి పన్నులను ఎక్కువచేసినప్పుడు ఆయా వ్యాపారములకు సంబంధించిన పరిస్థితులు ఎలా ఉన్నవో విచారించవలసి ఉన్నది లారీ ట్రాన్స్‌పోర్టును విరివిగా ఉపయోగించే అవకాశములు ఆయా ప్రాంతములలో ఉన్నవా ? తగినంత సరుకు ఉన్నదా ? అనే విషయాలు పరిశీలించవలసి ఉంది కాబట్టి ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపిస్తే వాటినన్నిటిని సమగ్రంగా చర్చించడానికి అవకాశం కలుగుతుంది అంతేకాకుండా హెచ్చు పన్ను భరించలేని వారిని మినహాయించడానికి వీలు కలుగుతుంది కనుక ఈ సవరణను అంగీకరించగోరుతాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య — ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించవలెనని కోరుతున్నాను దీనిని ప్రజాభిప్రాయానికి పంపవలెననేటటువంటి సవరణను ప్రభుత్వం అంగీకరించలేదు ఈ బిల్లును కొన్ని నెలల క్రిందటనే గెజిట్‌లో ప్రకటించడం జరిగింది కనుక ప్రజాభిప్రాయానికి పంపనవసరంలేదని అన్నారు అయితే ఈ బిల్లును గెజిట్‌లో ప్రచురించినపుడు దానిపై ప్రజాభిప్రాయమును కోరలేదు అందువల్ల దానిపై ఎవరు తమతమ అభిప్రాయములను తెలుపలేదు సభ్యులకు కూడా ఈ విధంగా ప్రజాభిప్రాయమును తెలుపుటకు అవకాశమీయలేదు వారు శాసనసభలోనే ప్రజాభిప్రాయమును తెలుపుతున్నారు అందువలననే దీనిని కనీసం సెలెక్టు కమిటీకి పంపించవలెనని కోరుతున్నాను 50 మైళ్ల లోపు రూట్సులో నడచే లారీలకు ఇది వర్తించదని మంత్రిగారు సెలవిచ్చారు అయితే 50 మైళ్ల లోపు రూట్సులో ఎన్ని లారీలున్నాయి ? ఆ విధముగా ఉంటే ఆ లారీల యజమానులు యింకా దివాలా ఎత్తకుండా ఉన్నారా ? అనే విషయాలు పరిశీలించవలసి ఉంది 50 మైళ్లలోపు రూట్సులో మాత్రమే నడచే లారీలు లేవనుకుంటూను, ఈనాడు ప్రతివారు లాంగ్ రూట్సు తీసుకుంటున్నారు

ఉమ్మడి మద్రాసురాష్ట్రంనుంచి ఆంధ్రరాష్ట్రం విడిపడినపుడు లారీలవారి మీద ఉభయ రాష్ట్ర ప్రభుత్వాలు పన్ను విధించడం సంభవించింది అయితే ఏదో ఒడంబడికల మూలకంగా

సర్దుబాటుచేసుకోవడం జరుగుతూవస్తున్నది అదే విధంగా మైసూరు, బొంబాయి రాష్ట్రాల వారితో ఒప్పందములు జరిగినవా ? ఇటువంటి విషయములన్నింటిని సెలెక్టు కమిటీలో ఆలోచించుకోవచ్చు ఆంధ్ర ప్రాంతం నుంచి రాయచూర్, బీదర్, ప్రాంతాలకు సరుకు తీసుకుని లారీలు పోతూ ఉంటాయి ఇటువంటి లారీలవారి మీద ఏవిధంగా పన్ను విధిస్తారు? లారీల వారు వారి గమ్యస్థానమువరకు కిరాయి తీసుకుంటారు ఆ కిరాయిని ఆధారంచేసుకొని పన్ను విధిస్తారా? లేక ఆయా రాష్ట్రములలో లారీప్రయాణముచేసిన దూరాన్నిబట్టి పన్ను విధించడం జరుగుతుందా ? అనేవి పరిశీలించవలని ఉన్నది ఈ విషయములన్నింటినీ సమన్వయపరచడానికి గాను ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపించడం అవసరం సెలక్టు కమిటీ దీనిని పరిశీలించడానికి కూడ ఎక్కువ వ్యవధి అవసరంలేదు 7–4–58వ తేదీకి ముందుగానే యీ బిల్లు పాస్ కావడానికి అభ్యంతరముండదు కాబట్టి దీనిని సెలక్టు కమిటీకి పంపించవలెననే సవరణను బలపరుస్తున్నాను

శ్రీ ఎన్ వెంకయ్య (అద్దంకి) – అధ్యక్షా ఈ బిల్లును తీసుకొని వచ్చేముందు ప్రయాణీకుల వద్ద అదనపు చార్జీలు ఏవిధంగా వసూలుచేయబడుతున్నది గమనించాలి తెలంగాణా ప్రాంతములో కూడ చార్జీలు తగ్గిస్తే బాగుంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి – తగ్గింపు మాట చెప్పవద్దు

శ్రీ ఎన్ వెంకయ్య ––అది ఆర్థికమంత్రిగారికి గిట్టనిమాట అయితే ప్రజలకు ఏది భారమో, ఏది కాదో వారు కూడా ఆలోచించి ఉంటారని అనుకంటున్నాను ఆంధ్రప్రాంతములో కన్న తెలంగాణా ప్రాంతములో బస్ చార్జీలు చాలా ఎక్కువగా ఉన్నవి అందువల్ల ఈ చార్జీలకు ఒకే మోస్తరుగా చేస్తే బాగుంటుంది బస్ యజమానులు, లారీ యజమానులు చాలా ఎక్కువ ఆర్జిస్తున్నారు కనుక వారి దగ్గరనుంచి ఏలాగైనా కొంత ధనం రాబట్టుకోవడం లవసరమని నేనూ అనుకొంటూ ఉండేవాడను అయితే యీ రోజుల ఈ సర్చార్జీలు ప్రయాణీకులమీద సరుకులు ఎగుమతి, దిగుమతిచేసుకొనే వారిమీద విధింపబడుతున్నవనేది స్పష్టము యీనాడు ఆంధ్రలో ప్రతి ప్రయాణీకుని వద్దనుంచి సర్చార్జి వసూలు చేస్తున్నారు అలాగనే లారీదార్లు సరుకులను రవాణాచేసేవారివద్ద నుంచి యీ అదనపు పన్నులను వసూలుచేస్తున్నారు కాబట్టి బస్, లారీల యజమానుల ఆదాయముల మీదనే ఈ పన్నువేయాలికాని ప్రయాణీకులమీద వేయ రాదని మనవిచేస్తున్నాను సీటుకు ఇంత అని పన్నువేయాలి అలాగే సరుకుల పరిమాణాన్ని బట్టి లారీ యజమానులవద్ద పన్ను తీసుకోవాలని నేను కోరుతున్నాను

*Sri V K Naik* ––I take it that this Bill, as it is a Money Bill, has been referred to the Governor and his consent has been obtained Assuming that, I proceed further

*Dr B Gopala Reddy* —Yes, Governor's consent has been obtained

*Sri V K Naik* —We know that this Bill affects commerce and industry in a much as there is shortage and paucity of railway wagons As the railway wagons are not available in large numbers, we have been propagating all the while for increase in trade by goods vehicles Goods vehicles, I know, are not taken as the most necessary things or as essential commodities But it should be taken as an industry in itself and as a commerce which would facilitate the trader, the commercial class and thereby the consumer class Suposing you increase the surcharge and supposing you increase the taxation on these vehicles then would it not decrease the trade or depreciate the value or check the incentive to increase road transport vehicles of commercial class ? The movement of commodities by goods vehicles due to paucity of railway wagons and the imports and exports that are necessary in the present context would largely be affected You may say that it is only a question of Rs 9 lakhs and that it is only a surcharge Yet, I think, the road transport condition will have to be looked into The industry in Telangana has to be considered and it has to be considered whether the area has got any large bulk of trade and whether there is the trading class whose incentive would not be affected We will have to make out a comparative statement with regard to the position of the industries in Telangana and in Andhra in the absence of which it is very difficult to know the real position So, it would not be wrong [to examine] that the comparative statements [to refer the Bill to the Select Committee] and to make any changes, either minor or major, may be necessary The Bill would again come up before this House after the members consider its educative value to the consumer, to the trading class and to the commercial Class I, therefore, suggest on behalf of the large scale industries and the citizens of Telangana in general that they should be given an opportunity to go through the comparative statement referred to by me and to send this Bill for the purpose to a Select Committee

Thanking you

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించవలసిన అవసరం గురించి అన్ని పార్టీలవారు అంగీకరించారు అంగీకరించనటువంటిది మంత్రివర్గం గూర్పిపే

మిస్టర్ స్పీకర్ —గూర్పుల సంగతి మాట్లాడకండి

*Sri Pillalamarri Venkateswarlu* — I am separating Cabinet from the Congress Party

*Mr Speaker* The hon Member cannot do that

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అనేకమంది, దీనిని సెలెక్టు కమిటీకి పంపాలని విశదంగా తెలియజేశారు మంత్రివర్గం కోరిన విధంగా ఏప్రిల్ లోగా తప్పక యీ బిల్లు శాసన అవుతుంది అందుకు ప్రతిపక్షం తరఫున మేము కూడ హామీ యిస్తున్నాము

*Dr B Gopala Reddy* The whole of March is earmarked for Budget discussion There will be no time for Bills

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — కాంగ్రెసు పార్టీకి మెజారిటీ ఉన్నది కాబట్టి తప్పకుండా యిలాంటి బిల్లులను పాస్‌చేస్తుంది ఇప్పుడు వారికి అంతకంటే వేరే కార్యక్రమంలేదు ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించి అన్ని వివరాలు సేకరించి చర్చించి దీనిని ఏవిధంగా రూపొందించాలో ఆలోచించి చేయుట మంచిదని కోరుతూంటే, దానిని నిరాకరించటం సరైన పద్ధతికాదు ఆంధ్రలో సర్‌చార్జి వేశామని, ఇక్కడకూడ ఎందుకువేయకూడదని అంటున్నారు పాసెంజర్స్ మీదవేయము, బస్సు మీద ఇది ఉండదంటున్నారు కాని ఈ బిల్లులో ఆ విధంగా ఎక్కడా ప్రొవైడ్ చేయలేదు ఈరోజున తెలంగాణాలో బస్ రేట్లు ఎక్కువగా ఉన్నవి ఇవాళ గోపాలరెడ్డిగారు మంచివారు కనుక పది పైసలు ఉంటే 12 పైసలు చేయలేదని మనం సంతోషించవచ్చు కాని రేపు అంతకంటె మంచివారు వచ్చి 10 పైసలను 12 పైసలుచేయటానికి పూనుకుంటే ఎవరూ ఏమీచేయలేరు కాబట్టి ఆ విషయం స్పష్టంగా బిల్లులో ప్రొవిజన్‌వుంటే, దీనిని సెలెక్టు కమిటీకి పంపకుండానే యిక్కడనే ఆలోచించుటకు వీలుండేది మేము అమెండ్‌మెంట్స్ కూడ యిచ్చాము ఇలాంటి అమెండ్‌మెంట్స్ యింత పెద్ద హౌస్‌లో చర్చించటం సాధ్యంకాదు కనుక, యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపాలని కోరినాము

లారీల విషయం ఉన్నది లారీలకు బాగా డబ్బు వస్తుందని వెంకయ్యగారు కూడ యింతకు ముందు మాట్లాడుతూ చెప్పారు బాగా సంపాయించేవారినుంచి యీ పన్ను తీసుకొనవచ్చును కాని అటువంటి పెద్దపెద్ద లారీల కంపెనీలు పెట్టుకున్నవారు కొద్దిమందే ఉంటారు ఏదో నాలుగయిదెకరాలుంటే అమ్ముకొని లారీలు పెట్టుకున్నవారు చాలామంది ఉన్నారు ఏదైనా యాక్సిడెంట్ జరిగితే అయిదు వందలు, వెయ్యి రూపాయలు నష్టం భరించేటప్పటికి, లాభం గూబల్లోకి వస్తున్నది కాబట్టి లారీలమీద విపరీతంగా లాభాలు వస్తున్నాయనుకొనుట, పొరపాటు

తెలంగాణాలో టాక్సేషన్ తక్కువని అంటున్నారు తక్కువకాదు ఆంధ్రలో, ఏ రాష్ట్రంలోను లేని టాక్సేషన్‌వేస్తున్నారు ఆ విధంగా గత పది సంవత్సరాలలోను పెంచుకుంటూ వచ్చారు ఎప్పటికప్పుడు ఇటువంటి బిల్లు మళ్ళీ బడ్జెట్ వచ్చేటప్పటికి ఎన్ని వస్తాయోనని భయంగాఉంది కొన్ని సందర్భాలలో 200, 300 పర్సెంట్ కూడ పెంచుతున్నట్లు కనబడుతున్నది

బిల్లు అంతా క్షుణ్ణంగా చదివితే యింకొక విషయం కనబడుతుంది ఈరోజున టోల్‌గేట్ వసూలుచేస్తున్నారు అది ఆపివేయడానికి ఆర్డర్సు పంపారా? క్రిందటి సమావేశంతో

యీవిషయం వస్తే బ్రహ్మానందరెడ్డిగారుచెప్పారు పంచాయతీ బోర్డ్సు యీ టోల్‌గేట్సు డబ్బు వసూలుచేసుకొనుటకు కంట్రాక్ట్సు యివ్వకపోతే ఆపివేయుటకు ఉత్తర్వులు పంపామన్నారు కాని అన్నిచోట్ల వసూలు చేస్తూనే ఉన్నారు బెజవాడనుంచి హైదరాబాదుకు ప్రయాణం చేసే లోపల రు 3–8–0 రోజుకు కట్టవలసివస్తోంది 1938 సంవత్సరములో యీ టోల్ గేట్సు రద్దుచేసి అంతకు మూడు సంవత్సరములకు ముందు అనగా 1935 నుంచి లారీలవాద, మోటార్సు మీద సగటున ఎంత ఆదాయం వస్తుందో, దానిని జిల్లాబోర్డ్సుకు, మునిసిపల్ కౌన్సిల్సుకు పంచాలని ఉన్నది ఆ రోజులలో లారీలుకూడ తక్కువ ఈనాడు విపరీతంగా పెరిగిపోయినవి ఆ విధంగా జిల్లాబోర్డ్సుకు పంచిపెట్టుతున్నారా ? ఆంధ్రలో ఒక బిల్లు పాస్‌చేసినట్లు నాకు గుర్తు ఉచిత విద్య చెప్పబోతున్నామని వాళ్లకు యిచ్చే ఆదాయాన్ని యివ్వకుండా ఎగగొట్టింది ఈ సమస్యలన్నీ యిట్లా ఉండగా, టోల్‌గేట్సు యథాపూర్వం అట్లాగే ఉంచి లారీన్‌కు సర్‌చార్జీ కట్టండంటున్నారు రోజుకు 0–12–0 అయితే గంటకు 0–0–6 అయింది విపరీతంగా లాభాలు వచ్చేవారు ఆ మాత్రం కట్టలేరా అంటున్నారు సంవత్సరానికి రు 270 లు అదనంగా పన్నువేస్తున్నారు ఇంత పన్నువేసే యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపకుండా పాస్‌చేయమంటున్నారు గోపాలరెడ్డిగారికి సంప్రదాయంగా అలవాటైపోయింది బ్రహ్మాండమైన పన్ను వేస్తూ ప్రజలకు చెప్పుకోటానికి అవకాశం యివ్వరు కనీసం సెలెక్టు కమిటీకి పంపమన్నా పంపరు పంపుటకు ఎందుకు వ్యతిరేకిస్తున్నారో నాకు బోధపడటంలేదు తరువాత ఆంధ్రలో నేషనలైజ్ చేస్తున్నామనే విషయం చెబుతున్నారు

ఆంధ్రలో మైలుకు 4 నయా పైసల చొప్పున రేట్లు ఉంటాయని మన చీఫ్ మినిస్టర్‌గారు ప్రకటించారు ఇక్కడ తెలంగాణాలో మైలుకు 5½ నయా పైసలు వసూలు చేస్తున్నారు ఆంధ్రకన్నా తెలంగాణాలో 1½ నయా పైస ఎక్కువ వసూలుచేస్తున్నారు ఆంధ్ర తెలంగాణాలకు ఇంకా వేరువేరుచట్టాలే ఉన్నాయి విశాలాంధ్ర ఏర్పడి 1½ సంవత్సరములయినది ఈ రెండు ప్రాంతాలలోని చట్టాలను సమన్వయంచేయటానికి ఎందువల్ల కృషిజరపటంలేదో, నాకు అర్థం కావటంలేదు ఈ రెండు ప్రాంతాలలో ఉన్న చట్టాలను సమన్వయంచేయటానికి ఒక కమిటీని వేశామన్నారు ఆ కమిటీ ఏమిచేస్తోంది ? ఆ కమిటీ చేస్తున్న పని ఏమిటో నాకు బోధపడటంలేదు

డాక్టర్ బి గోపాలరెడ్డి —చట్టాల సమన్వయం చేయుటానికి కమిటీని వేయలేదు లాండ్ రెవిన్యూకు సంబంధించి ఒక కమిటీని వేశారు

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —ఇందాక ఒక మిత్రుడు డబుల్ టాక్సేషన్ గురించిచెప్పారు. ఆంధ్రలో ఉన్న లారీ, అక్కడ ఉన్న 1400 రు పన్ను చెల్లించిన తరువాత కూడా, ఆ లారీ తెలంగాణాప్రాంతానికి వస్తే, తిరిగి 200, 300 రూపాయల పన్ను అధికంగా కట్టుకోవలసివస్తున్నది ఈ విధంగా రెండుసార్లు పన్ను చెల్లించవలసిఉంటుంది ఇది సరైన విధానంకాదు ఈ డబుల్ టాక్సేషన్ విధానం ఇంకా అట్లానే అమలు జరుపుతారా అని అడుగుతున్నాను ఈ విషయాలన్నీ ప్రభుత్వంవారు ఆలోచించారా ? ఈ విషయాలన్నీ యీ సమస్యలన్నీ శ్రద్ధగా ఆలోచించటానికి, యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించాలని కోరుతున్నాను ఆ కమిటీలో అన్ని సమస్యలు పరిష్కారముచేసుకోవచ్చును ఈ డబుల్

టాక్సేషన్ క్వశ్చన్ మీద హైకోర్టులో రిట్స్ కూడా వేశారు ప్రభుత్వం వారు ఆలోచన లేకుండా ఏ విధంగా పరిపాలన చేస్తున్నారు, బహిర్గతం చేస్తూ, ప్రభుత్వం యొక్క లోపాలన్నీ వెల్లడిస్తూ హైకోర్టులో రిట్స్ వేస్తూంటే, యీ డబుల్ టాక్సేషన్ గురించి ప్రభుత్వం ఏమి ఆలోచిస్తోంది ? హైకోర్టు జడ్జీలు, యీ డబుల్ టాక్సేషన్ వేయటానికి వీల్లేదని చెప్పే అవకాశాలున్నాయి

డాక్టర్ బి గోపాలరెడ్డి —వారు ఆ విధంగా తీర్పు ఇచ్చారా ?

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —ఆ విధంగా తీర్పు ఇవ్వలేదు గాని ఆ విధంగా తీర్పు ఇచ్చే అవకాశాలు ఉన్నాయి ఈ బిల్లు చిన్న బిల్లు కాదు ఈ టాక్సువల్ల 9 లక్షల రూపాయలు వస్తాయని అన్నారు మొత్తం తెలంగాణాలో 2528 లారీలు ఉన్నాయి నా లెక్క ప్రకారం వాటి మీద 6 లక్షల రూపాయలు వస్తాయి ఇంకా 3 లక్షల రూపాయలు పేటి మీద ఎక్కువ చేయబోతున్నారు? అన్నది ఆలోచించవలసి ఉన్నది ఈరోజున R T D బస్సులు కొన్ని ఉన్నాయి ఇవిగాక ప్రయివేటు బస్సులు కొన్ని ఉన్నాయి ఈ పన్ను ప్రయివేటు బస్సులమీద కూడా పడుతుందేమోనని భయం నాకు ఉన్నది ప్రభుత్వంవారు యీ బిల్లులోని "ఆబ్జెక్ట్సు అండ్ రీజన్సు "లో వ్రాశారు మేము ఆవిధంగా భయపడటానికి అవకాశం కలుగజేశారు ఇందాక, "50 మైళ్ల రూట్సు వాటిని exempt చేశాము" అని అన్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —అది ఒరిజినల్ యాక్టులోనే ఉన్నది నేను అది కొత్తగా చేసింది కాదు

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —ఒరిజినల్ యాక్టులో మంత్రిగారు చెప్పింది లేదు ఒరిజినల్ యాక్టులో ఉన్నదిది —

"Provided that no tax shall be levied on any passenger, luggage or goods carried in a stage carriage, the total permitted daily mileage of which does not exceed fifty miles "

లారీ రోజుకు 50 మైళ్లకంటే ఎక్కువ ప్రయాణం చేయకూడదని ఉన్నది రోజుకు 50 మైళ్ళకంటే ప్రయాణం చేయకపోతే, లారీవాళ్లు ఏమి తింటారు ? వాళ్లు ఎలా బ్రతకాలి? ఇది వాళ్ళకు ఉపయోగపడటానికి చేయలేదు 50 మైళ్ల దూరం పోయేవాటిని యీ బిల్లునుండి exempt చేయాలనే ఉద్దేశంతో నేను ఒక అమెండ్‌మెంటు ఇచ్చాను ఈమధ్య రైళ్ళలో కూడా 15 మైళ్ళకు లోపున ఉండేదానికి exempt చేయాలని అన్నారు 50 మైళ్ళవరకు నేను టికెట్ కొంటాను దానికి సర్చార్జి ఉండదు 50 మైళ్లవరకు లారీ సరుకును తీసుకొని ప్రయాణం చేస్తుంది దానిమీద సర్చార్జి ఉండదు కాబట్టి 50 మైళ్ళవరకు exempt చేయాలి ఈ బిల్లును సెలక్టు కమిటికి పంపిస్తే, అక్కడ యీ విషయాలన్నీ ఆలోచించటానికి వీలుంటుంది ఈ బిల్లును సవరించవలసిన అవసరం చాలా ఉన్నది నేను యీబిల్లుకు సవరణ ఇచ్చాను ఎక్కువ మంది శాసనసభ్యులు ఆమోదంతో ఈ అమెండ్‌మెంట్లు తయారుచేసి, ఇవ్వటం జరిగింది

ఈనాడు నేషనలైజేషన్ సమస్య తీసుకవచ్చారు ఆంధ్రలో బస్సులు నేషనలైజ్ చేయబోతున్నారు నేషనలైజేషన్ చేసిన తరువాత మైలుకు 4 నయాపైసల రేటు ఉంటుందన్నారు

డాక్టరు బి గోపాలరెడ్డి —నేష లైజేషన్‌కు యీబిల్లుక సంబంధంలేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ఎందువల్ల సంబంధము లేదు ? ఆ యాక్టు ఇక్కడ వర్తింపచేస్తున్నారు కదా ఆ బస్సులను నేషనలైజ్ చేస్తే సర్‌చార్జీ వుంటుందా ? పోతుందా?

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఉంటుంది గవర్నమెంటు బస్సులు అన్నీ, అన్ని టాక్సులు కట్టాలి

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —అంటే తెలంగాణాలో వున్న యీ సర్‌చార్జీని ఆ బస్సుల మీద కూడ వేస్తారన్న మాటేగా? కాబట్టి ఈ బిల్లులో ఉన్న ప్రమాదాలన్నీ తొలగించటానికి ఈ బిల్లును తప్పని సరిగా సెలక్టు కమిటీకి పంపించాలని కోరుతున్నాను 4 నయాపైసల రేటు వున్నచోట, ఈ సర్‌చార్జీ లేదని ఖచ్చితంగా వ్రాయాలి—మొదట మద్రాసు శాసనసభలో యీ సర్‌చార్జీ వేయటానికి మేమంతా వ్యతిరేకించాము ఆనాడు ప్రజలు మమ్ములిని ఎన్నుకొని శాసనసభకు పంపినందువల్ల వారికి కలిగిన మేలు ఏమిటంటే, ఆ సర్‌చార్జీ పాసింజర్సు మీద పడకుండా బస్సు ఆపరేటర్సు మీద పడేటట్లు చేశాము ఆనాడు రాజగోపాలాచారిగారు అంగీకరించకపోయినా, యీ సర్‌చార్జీ మీద పడకుండా చేయగలిగాము

ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత హైకోర్టు తీర్పు వచ్చింది అప్పుడు మీకు కూడా (కాంగ్రెసు పార్టీకి) బలం వచ్చింది ప్యాసింజర్ల మీద పన్ను పడేటట్లు చేశారు ఆనాడు మద్రాసు శాసనసభలో యీ సర్‌చార్జీ బస్సు ఆపరేటర్స్ మీద పడేటట్లు మేము చేశాము 3 నయా పైసలో, 4 నయా పైసలో ఎన్నో కొన్ని—"ఇన్ని నయాపైసలు రేటు వున్నట్లయితే, దానిమీద సర్చార్జీ వేయటానికి వీలులేదు " అన్న విధంగా మనం ఈ బిల్లులో provide చేయవలసిన అవసరం ఉన్నది ఈ విషయాలన్నీ మనం దీర్ఘంగా ఆలోచించకుండా, ఈ బిల్లును ఎట్లు pass చేయాలో నాకు అర్థం కావడం లేదు

ఆంధ్రలో బస్సులు నేషనలైజ్ చేసి 4 నయా పైసలు చొప్పున రేటు పెంచుతున్నారు ఇప్పుడు సర్చార్జీ వేస్తే తెలంగాణాలో ఎంత రేటు వున్నదో, అంతరేటు రేపు ఆంధ్ర ప్రాంతంలో బస్సులను నేషనలైజ్ చేయగానే అవుతుందని, నాకు భయంగా వుంది మీరు చెబుతూన్న నేషనలైజేషన్ అంటేఅర్థం ఏమిటి ? నేషనలైజేషన్ అంటే రేట్లు పెంచటం కాదు, డ్రైవర్లును పనులలోనుంచి తీసివేయటం కాదు నేషనలైజేషన్ అన్నది ఒక మంచి సూత్రము—కాని ఇప్పుడు మీ ప్రభుత్వం వల్ల బస్సు ఆపరేటర్సుకు అనుకూలము జరుగుచున్నది ఇప్పుడు తెచ్చిన బిల్లు అసమగ్రంగా ఉన్నది ఈ బిల్లు చాలా perfect గా వున్నదని అనుకోవద్దు ఈ బిల్లు చాలా లోప భూయిష్టంగా ఉంది ఆ విధంగా వున్నటువంటి యీ బిల్లును మనం ఎందుకు pass చేయాలి ? ఇక్కడ అనేకమంది చదువుకొన్నవారు, లాయర్స్ వున్నారు అటువంటి వారితో సెలక్టు కమిటీని ఏర్పాటు చేసి, ఈ బిల్లును ఆ సెలక్టు కమిటీకి పంపిస్తే, అక్కడ అన్ని విషయాలు

సమగ్రంగా చర్చించుకొని, యీ బిల్లులోని లోపాలను సవరించుకోవచ్చును ప్రతి బిల్లు సెలక్టు కమిటీకి పోయి, తరువాత శాసనసభలో pass కావాలనేది, ఒక ప్రిన్సిపుల్‌గా ఆమోదిస్తే మంచి దనుకుంటున్నాను అందువల్ల ఈ బిల్లును తప్పని సరిగా సెలక్టు కమిటీకి పంపించాలని మీ ద్వారా మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —అధ్యక్షా! గౌరవనీయులైన నారాయణరెడ్డిగారు ఉపన్యాసము లేకుండానే యీ ప్రతిపాదన చేశారు తక్కినవారు ఆ ప్రతిపాదనను అందుకుని చాలా దీర్ఘ ఉపన్యాసాలు చేస్తూ, ఇది జాతీయము చేయడమా, లేదా, దీని విషయము లో మేము చాలా భయము, ఆందోళన పడుతున్నాము అని అన్నారు ఈ విషయములో వారు ఏమాత్రము భయపడవలసిన అవసరము లేదు దీనిని సెలెక్టు కమిటీకి పంపవలసిన అవసరము అంతకంటే లేదు ఎందుకంటే ఈ బిల్లు ఒకానొకప్పుడు సెలెక్టు కమిటీముందుకు వెళ్ళినది అప్పుడు కాంగ్రెసు పార్టీ కూడ మెజారిటీలో లేదు ఆ సమయములోనే సెలెక్టు కమిటీని వేయడము జరిగినది అందులో వెంకటేశ్వర్లుగారు, గోపాలకృష్ణయ్యగారు కూడ మెంబర్లుగా ఉన్నారు వారందరి ఆశీర్వచనములతోనే ప్యాసు అయిన బిల్లు ఇది అది జరిగిన తరువాత అయిదారు సంవత్సరములుగా యిది అమలులో ఉన్నది ఇది మదరాసు రాష్ట్రములో గూడ అమలులో వున్నది ఆంధ్రలో వున్న పదకొండు జిల్లాలలో వున్నది మైసూరు రాష్ట్రములో ఉన్న దక్షిణ కెనరా, బళ్ళారి జిల్లాలలో కూడ అమలులో వున్నది ఇన్ని జిల్లాలలో ఇది ఇప్పటికి అయిదారు సంవత్సరాలుగా అమలులో వుంటున్నప్పుడు ఇంతవరకు దీని విషయములో ఏలాంటి అభ్యంతరములు రాకుండానే ఇది అమలు జరుపబడుచున్నది ఇదే బిల్లు మనకు ఆంధ్రలో వున్నది గనుక తెలంగాణాలో కూడ అన్వయింప జేయడము మంచిదని దీనిని ఇప్పుడు తెచ్చాము ఈ టాక్సు అనేది ఆంధ్రలో లారీల మీద, బస్సుల మీద ఉన్నది ఇది తెలంగాణాలో లేదు గనుక తెలంగాణాలో కూడ అన్వయింప జేయడము మంచిదని భావించి ఈనాడు యీ బిల్లును తేవడమైనది అంతే కాని, యిది క్రొత్తగా తెచ్చిన బిల్లు కాదు గనుక దీనిని ఎవరు ఆక్షేపించ వలసిన అవసరముండదు ఇది ఏదో ఎక్కడను లేనటువంటి క్రొత్త బిల్లు అయితే గాని యిదివరకు దీని విషయములో అనుభవము లేనిది అయితే గాని, దీనియొక్క మంచి చెడ్డలు తెలియక పోతే గాని, దీని విషయములో administrative గా ఏ ఇబ్బంది వస్తుందోనని గాని భావించి నట్లయితే అప్పుడు అభ్యంతరములు చెప్పవచ్చు అప్పుడు దీనిని సెలెక్టు కమిటీకి పంపడము న్యాయమే కాని ఇది అలాంటి దేమీ కాదు ఇది ఇదివరకే అమలులో వున్న బిల్లు గనుక, దీని అనుభవములు మనకు తెలిసినవే ఇది కాలము పరీక్ష నెగ్గినటువంటి బిల్లు గనుక దీనిని సెలెక్టు కమిటీకి పంపమని కోరడము న్యాయము కాదు ఇది ఇంతకుముందు సెలెక్టు కమిటీవారివల్ల పరిశీలించి ప్యాసు చేయబడింది మనము మద్రాసు రాష్ట్రములో వుండగా మన సభ్యులలో చాలామంది మెంబర్లుగా వున్నప్పుడు సెలెక్టు కమిటీలో కూర్చుని ప్యాసు చేసినదే అంతే కాని ఇదేమి క్రొత్తగా తీసుకుని వచ్చి కూర్చున్నది కాదు అప్పటి నుంచి యిప్పటి వరకు అమలులో వుంటున్నది ఈ విషయము మన గోపాల కృష్ణయ్యగారికి వెంకటేశ్వర్లుగారికి తెలియనిది కాదు దీనివల్ల అరులక్షలు, తొమ్మిది లక్షలు వస్తుందని మన వెంకటేశ్వర్లుగారు చెబుతున్నారు ఇందులో కొద్దిగా మార్పు చేస్తున్నాము తెలంగాణా

లో కూడ యీ టాక్సు వుండడము మంచిదని తెస్తున్నామే గాని, యీ బిల్లువల్ల కోట్లకొలదీ డబ్బు వచ్చేది ఏమీ లేదు ఈ టాక్సు కూడా బస్సుమీద వేయడములేదు బస్సులమీద వేయక పోవడము, లారీలు, యితర vehicles మీద వేయడము అంటే, బస్సుల విషయములో దాక్షిణ్యముగాని, మెహర్బానీగాని ఏమీ లేదు బస్సులమీద వేయక పోవటానికి కారణము దీనికి సంబంధించిన రెండవ బిల్లు విషయము వచ్చినప్పుడు విశద పరచ గలను ప్రభుత్వ బస్సులు గాని లారీలుగాని ఉన్నను అవికూడ టాక్సు కట్టవలసినదే పెట్రోలు టాక్సుగాని, Sales Tax గాని, Motor Vehicles Tax గాని, ఏది వున్నను అన్నిరకాల టాక్సులు అన్నిరకాల Vehicles కట్టవలసినదే ఇదీ Select Committee వారు పరిశీలించి ప్యాసు చేసినదే గనుక దీని అనుభవములు మనకు తెలుసు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —సెలెక్టు కమిటీకి పంపినమాట నిజమేకాని, అప్పుడో దానిని వారు వ్యతిరేకించారు అందువల్ల ఆ బిల్లు అంతటితోపోయింది

డాక్టరు బి గోపాలరెడ్డి —పోయిఉంటే, మరల ఇది ఎట్లాఅమలులోఉండి వుంటుంది?

మిస్టర్ స్పీకర్ —బహుశ అది ప్యాసు అయ్యేఉంటుంది లేకపోతే అది అమలులోనికి ఎట్లావచ్చిఉంటుందిలెండి?

డాక్టరు బి గోపాలరెడ్డి —అందువల్ల దీనినిమరల సెలెక్టు కమిటీకి పంపవలసిన అవసరము లేదనిఅంటున్నాను ప్రస్తుతము బస్సులమీద టాక్సు వేయడములేదు ఒక్కలారీలమీదనే వేస్తున్నాము విజయవాడమీదుగా గుంటూరునుంచి హైదరాబాదుకు, ఇక్కడనుంచి మరల గుంటూరుకు ఎన్నోలారీలు పోతూఉన్నవి వస్తూఉన్నవి వీటి అన్నింటిమీద ఒకేవిధమైన టాక్సు వేయడము న్యాయము అంతేకాని ఒకచోట ఒకవిధము, యింకొకచోట యింకొక విధముగా ఉండడము బాగాలేదు ఇట్లాఉంటే ఇదిసాలీసేత, మాలసేత అనిపించుకుంటుంది ఈ పద్ధతి బాగాలేదు నిజానికిచూస్తే, ఇక్కడ హైదరాబాదునుంచి ఇటుగోదావరిజిల్లాదాకా, అటు మద్రాసుదాకా గూడ లారీలుపోతూ వస్తున్నవి వాటి యిష్టమువచ్చినట్లు ఎక్కడికిపడితే అక్కడికి పోతున్నవి అందువల్ల మన ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంతవరకు, అందులో ఇదే బిల్లు మద్రాసు రాష్ట్రములో గూడ అమలులో ఉన్నదిగనుక, అక్కడ మద్రాసు రాష్ట్రములో మన రాష్ట్రానికి వచ్చేవరకు ఏ ముప్పది నలభై మైళ్ళదాకనో ఒక టాక్సు, ఇక్కడ ఆంధ్రలో ఇంకొక టాక్సు, తరువాత ఇక్కడ హైదరాబాదుకు వచ్చేటప్పటికి యింకొకరేటు, యిట్లాగా ఉండడముసాలీసేత, మాలసేతగా ఉంటుందిగనుక దీనినికొంతవరకు సమన్వయ పరచడము మంచిదన్న ఉద్దేశ్యముతో తెచ్చాము Surcharge కూడ అక్కడ ఒకవిధము, ఇక్కడ ఒక్క విధము, ఇంకొకచోట ఇంకొక విధముగ ఉన్నది ఇది అంతా Confusion గా ఉంటున్నది ఇందులో administrative difficulty గూడ వస్తున్నది

తరువాత కొంతమంది సభ్యులు Toll Gate వద్ద Tax కట్టవలసి వుంటున్నదని రోడ్లు బాగాలేవుఅని, యీ మాదిరిగా అనేక విషయాలు చెప్పారు ఈ విషయాలను గురించి

నేను దీనికి సంబంధించిన రెండవ బిల్లు విషయము వచ్చినప్పుడు అన్నివివరాలు చెబుతాను అప్పుడు మనము మాట్లాడుకోవచ్చు ఈ surcharge విషయము అక్కడ ఉన్నట్లు ఇక్కడ కూడ ఉన్నది ఇది యిప్పటికి అయిదారు సంవత్సరలుగా ఉంటూనే ఉన్నది ఇందులో కొత్త విషయము ఏమిలేదు కాబట్టి దీనిని సెలెక్టు కమిటీకి పంపనవసరములేదని యీబిల్లును ప్యాసు చేయవలసినదని కోరుతున్నాను

*Mr Speaker* The question is

"That the Bill be referred to a Select Committee"

The motion was negatived

*Sri R Narayana Reddy* I demand a division, Sir

The House then divided

Ayes 36 Noes 75

The motion was negatived

*Mr Speaker* The question is

"That the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957, be taken into consideration at once"

The motion was adopted

శ్రీ ఆర్ నారాయణరెడ్డి — General discussion కు అవకాశము యివ్వరా ?

డాక్టర్ బి గోపాలరెడ్డి — Discussion అంతా అయిపోయిన తరువాత, యింకనూ General Discussion ఏమి ఉంటుంది ?

మిస్టర్ స్పీకర్ —మొదటి రీడింగుమీద మోషనును ఓటుకు పెట్టడము అయిపోయింది గనుక ఇకమీాదట clause by clause చర్చ జరుగుతుంది

*Clause 2*

*శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —దీనిని తెలంగాణా ప్రాంతానికి అంతటికి వర్తింప చేయాలనే విషయం యీ క్లాజు ద్వారా సూచించడంజరిగింది ఇప్పుడున్నటువంటి పరిస్థితుల

బట్టి— — తెలంగాణాసభ్యుల యొక్క అభిప్రాయాన్ని పూర్తిగా తెలుసుకోకుండానే — — దీనిని ఆమోదించిచడం మావల్లకాకుండాఉన్నది తెలంగాణా రీజనల్ కమిటీకి యీ బిల్లునో గురించి చర్చించే అవకాశం చట్టప్రకారం లేకపోయినప్పటికి కూడా — —

మిస్టర్ స్పీకర్ — Regional Committee యొక్క Order నేను తెప్పించినాను, ఒకవేళ నేను పొరపాటుపడకుండా—అసలు ఆ కమిటీ ఎప్పుడు అమలులోనికి వస్తుంది, ఏయే విషయాలు ఉంటాయి? తెలియజేయుడం మంచిదనే ఉద్దేశ్యంతో—

The Order says

"It shall come into force on the 1st day of February 1958" Clause 4 of the Order reads like this

"4 All scheduled matters in so far as they relate to the Telangana region shall be within the purview of the Regional Committee to the extent and in the manner provided by this Order"

Clause 5 of the Order reads like this

"5. Every Bill affecting the Telangana region which is not a Money Bill and contains mainly provisions dealing with any of the scheduled matters shall upon introduction in the Assembly, be referred to the Regional Committee for consideration and report to the Assembly"

The Scheduled Matters under the Order are these

"1 Local self-government, that is to say, the constitution and powers of municipal corporations, improvement trusts district boards and other local authorities for the purpose of local self-government or village administration

2 Public health and sanitation, local hospitals and dispensaries,

3 Primary and secondary education,

4 Regulation of admissions to the educational institutions in the Telangana region,

5 Prohibition of the consumption, except for medicinal purposes of intoxicating liquors and of drugs which are injurious to health,

6 Sale of agricultural land,

7 Cottage and small scale industries,

8 Agriculture, co operative societies, markets and fairs,

9 Development and economic planning within the framework of the general development plans and policies formulated by the State Legislature"

కాబట్టి రవాణాను జాతీయంచేయడం, పన్నులు వేయడం యిటువంటివన్నీ కూడా దీని క్రిందకురావు ఈ విషయాలు మనం తెలుసుకుంటే ముందుకు proceed కావచ్చును ఇది న్యాయమా, అన్యాయమా అనేవిషయం మాట్లాడవలసియున్నది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — Regional Committee కి "ఈ విషయాన్ని refer చేయాలని order లో లేద" ని మీరు వివరించి చెప్పారు కాని ఇటువంటి సందర్భాలలో తెలంగాణా సభ్యుల అభిప్రాయాలను పూర్తిగా తెలుసుకొనవలసిన అవసరం ఉన్నదని నేనను కొంటున్నాను ఈనాడు తెలంగాణాలో కూడా అదనంగా పన్నులు వేయడమే తప్ప మరేమీకాదు మంత్రిగారు ఏమిచెప్పినప్పటికీ — — ఈ రోజున బస్సులమీద surcharge వేయ బోవడంలేదు అని చెప్పినప్పటికీ, ప్రస్తుతానికి, అనేమాట మాత్రం మాచెవులలో పతిధ్వనిస్తున్నది తప్ప ఇకముందు ఏమికాబోతున్నదో మాకు తెలియజేడంలేదు ఎంత ఉన్నప్పటికీ 5 నయా పైసలున్నా 0–1–0 ఉన్నా— సర్చార్జీవేసే అవకాశం మాత్రం మేము అట్టేబెట్టుకుంటాము అని చెప్పడం ఏ విధంగా కూడా సరిగాలేదు ఏదైనా particular rate ఉండినట్లయితే, అదివేయకుండాచేస్తామనే హామీ కూడా యింతవరకూ ఏమీలేదు ఆలాంటప్పుడు యీ tax బస్సు పాసింజర్ల మీద, మామూలు ప్రజానీకం మీదనే ఖచ్చితంగా పడుతుంది గాబట్టి మేము దీనికి అంగీకరించడం కష్టసాధ్యమైన విషయం ఈనాడు తెలంగాణాలో ఆర్థిక విధానం చాలావెనుకబడి ఉన్నదని చాలామంది చెబుతున్నారు మనం పరిశీలించినా అదేస్థితి గోచరిస్తుంది తెలంగాణా ఆర్థికంగా వెనుకబడివున్న పరిస్థితులలో ——— "ఆంధ్రలో అదనంగా పన్నులభారాన్ని మోపుతున్నాము కనుక తెలంగాణాలో వేయకపోతే ఎట్లాగు, అనేవిధంగా ఆలోచించడం చాలా పొరపాటని నా అభిప్రాయం ఈ ప్రాంతంన్ని కూడా గుంటూరు కృష్ణా, నెల్లూరు జిల్లాలలోని డెల్టాభూముల లెవల్ తయారుచేసిన తరువాతయి క్కడకూడా, అదనపు పన్నులువేసే విషయం ఆలోచిస్తే అర్థం ఉంటుంది కాని అవేమీ లేకుండావిశాలాంధ్ర ఏర్పడినప్పటినుంచి అదనపు పన్నుల కార్యక్రమమే ప్రధానంగా చూచేపద్ధతిలో యీ ప్రభుత్వం నడుస్తున్నదంటే మా ప్రతిపక్షం మద్దతు ఇవ్వలేదని విజ్ఞప్తిచేస్తున్నాను కాబట్టి దీనిని మేము వ్యతిరేకించక తప్పదు

తెలంగాణాలో లారీలమీద పన్నులు వేస్తున్నామని చెప్పారు ఇదీ తెలంగాణాలోని లారీలు మీద పన్నులు వేయడం మాత్రమేకాదు ఆంధ్రనుంచివచ్చే లారీలమీద కూడా యీ భారం

తప్పకుండాపడుతుంది లారీలకు పన్ను, సంపర్జీ పన్ను ఇవన్నీ ఒక సంవత్సరానికి రూ 1,400 లేక రూ 1,500 లు చెల్లించేవారు అదనంగా రూ 300 లేక రూ 400 కట్టవలసిన పరిస్థితి ఏర్పడితే యిది ఏవిధంగా ఎట్టి పరిణామం యిస్తుందో ఒకతడవ ఆలోచించవలసినదని కోరు తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —రెండు దఫాలు ఇంతకుముందు కట్టలేదు, ఇకముందు కూడా కట్టనక్కరలేదు ఒక లారీ హైదరాబాదునుంచి బెజవాడ పోయేలోపల double taxation ఏమీలేదు

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —హైదరాబాదునుంచి, బెజవాడ వెళ్ళేలోపలకాదు ఆంధ్రలో రిజిష్టరుకాబడి, లైసెన్సు పొందిన బస్సు తెలంగాణా routes లో ప్రయాణం చేయాలంటే tax కట్టాలి ఆంధ్రలో తీసుకున్నటువంటిది కృష్ణా జిల్లాతోఅంతమైపో తుంది నల్లగొండజిల్లానుంచి తెలంగాణా ప్రాంతం ప్రారంభంఅవుతుంది Double taxation ఉన్నది దీనినిగురించి హైకోర్టులో 'writs' కూడా వేయ బడినాయి "మేము double taxation అక్కరలేదని అంగీకరిస్తున్నాము" అని ప్రభు త్వంవారు చెప్పినట్లయితే ఆ writs కూడా withdraw చేసుకుంటారు ప్రభుత్వా నికి పన్నుకూడా వసూలు అవుతుంది లేకపోతే అట్లాగే ఉండిపోతాయి ఇప్పుడున్న position యిది కాబట్టి యీ double taxation system ను మేము బల పరచలేము ప్రజాభిప్రాయం విషయమై "ప్రజలు మాదగ్గర అసమ్మతి తెలియజేయలేద"ని చెబుతున్నారు కాని, నా దగ్గర చాలామంది ప్రజలు అసమ్మతి తెలియజేశారు 'వేసిన పన్ను లన్నింటి మీద ప్రజాభిప్రాయం తెలుసుకొనిరండి', అని గోపాలరెడ్డిగారు క్రిందటి సమావేశంలో ఒక సందర్భంలో చెప్పారు నేనువెళ్ళి అన్ని పన్నుల మీద ప్రజాభిప్రాయం తెలుసుకున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —మాదగ్గరకు అటువంటి అసమ్మతులేమీ రాలేదు మీకువస్తే మాకేమీ అభ్యంతరంలేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ప్రజాభిప్రాయం తెలుసుకొనడానికి మేము సిద్ధంగా ఉన్నాము, మీరు సిద్ధంగాలేరు అదీ వచ్చినబేధం మేము తెలుసుకోగా తెలంగాణాలో యీ పన్నులభారాన్ని వహించడానికి సిద్ధంగాలేరని వెల్లడిఅయినది ఇక ఆంధ్రలో surcharge, double taxation, toll gates ఇవన్నీ ఉన్నప్పటికీ "తెలంగాణా లో పన్నులు పెంచుతున్నారు మనమీద కూడా అదనంగావేస్తే ఏ 300 రూ లో అదనంగా కట్టవలసివస్తుందేమో" అని వారు గుడ్లు మిటకరించే పరిస్థితి ఉన్నది ఇది దారుణ పరిస్థితు లనుతెచ్చే బిల్లు దీనిని తెలంగాణా ప్రాంతానికి వర్తింపచేయాలనే ఉద్దేశం మాకు లేదు ఈ బిల్లు ఉద్దేశ్యం తెలంగాణాలో మాత్రమే పన్నులు వేయడంకాదు ఆంధ్ర ప్రాంతంలో కూడా అదనంగా పన్నులువేసే ఉద్దేశ్యం తప్ప, మరేమీకాదు అసలు యీ బిల్లు తేవడం అనవసరం. అందువల్ల దీనిని తెలంగాణా ప్రాంతానికి వర్తింపచేయాలనే విషయాన్ని మేము వ్యతిరేకిస్తున్నాము,

*డాక్టర్ బి గోపాలరెడ్డి —దీని Co-ordination Bills ప్యాసయిన తరువాత double taxation అనే anomaly పోతుంది ఇప్పుడు రెండు Acts క్రింద ఉన్నాయి ఆంధ్ర చట్టంపేరుగానూ, తెలంగాణా చట్టం పేరుగానూ ఉన్నాయి Hyderabad Act ను repeal చేసి Andhra Act క్రిందకు తీసుకువస్తున్నాము కాబట్టి అటువంటి anomaly ఉండదు అందువల్ల యీ బిల్లును అత్యంతావశ్యకంగా pass చేయవలసిన అవసరం ఉన్నది

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —మంత్రిగారు చెప్పినట్లుగా యీ బిల్లు pass కావడంవల్ల జరుగదు దీనితరువాత బిల్లులో Hyderabad Act కు amendment పెట్టినారే కాని దానిని ఆంధ్ర జిల్లాలలో వర్తింపచేయాలని పెట్టలేదు కనుక, దాని ఫలితం కూడా నెరవేరదు

శ్రీ యం నాగిరెడ్డి —అధ్యక్షా, ఇప్పుడు తెలంగాణాకు యీ బిల్లునువర్తింపజేయడం వల్ల ఒక uniformity వస్తుందని మంత్రిగారు ఒక ప్రైపున చెబుతూంటారు మరల, ప్రజలమీద, ప్రయాణీకుల మీద యీపన్ను పడదని కూడా చెబుతూవుంటారు ఏమైనా ఈ బిల్లు వలన ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు సమానత్వం పొందుతాయి అంటున్నారు అట్లా సమానత్వం పొందటానికి ఈ బిల్లుద్వారా అవకాశం లేదని నా అభిప్రాయం ఏ విధంగా చూచి నప్పటికీ uniformity రాదు Taxation విషయంలో 25%, 33⅓% లేక రెండురెట్లు, మూడు రెట్లు పెంచాలని ఆబిల్లులో వున్నది తప్ప equalగా ఆంధ్రప్రాంతంలో Vehicles మీద tax వేసే విధంగానే ఇక్కడకూడా వేస్తాము అనే విషయం లేదు అందువల్ల uniformity వస్తుందనీ, double taxation తప్పుతుందనీ, అక్కడకీ ఇక్కడికీ వుండే తేడాలు తొలగి పోతాయనీ ఈ బిల్లువల్ల తెలియడంలేదు అట్లా చెయ్యాలంటే taxation, surcharge వీటిని uniform చేసేందుకు ఒక బిల్లు తెస్తే సరిపోయేది కాని యీ బిల్లు అట్లా చేయుటకుద్దేశించబడలేదు ఈ ప్రాంతంలో కూడా ఆంధ్ర ప్రాంతంలోని level కు తెస్తున్నాము అంటున్నారు తెలంగాణా ప్రాంతంలోని లారీల సంగతి మంత్రిగారికి తెలుసు ఇది ఆర్థికంగా చాలా వెనుకబడిన ప్రాంతం రహదారీ సౌకర్యాలు బహుతక్కువ ఇక్కడనుంచి market కు వెళ్ళాలంటే చాలా దూరం వెళ్ళాలి రైల్వే సౌకర్యాలు లేవు ఇక్కడ పండే వ్యాపార పంటలు గాని తదితర సరుకులుగాని market కు పోవాలంటే లారీలే తప్ప మరొక గత్యంతరం లేదు సరైన రోడ్లు లేవు డొంక దారులలో ఈ లారీలను నడుపుతుండే లారీలకు విపరీతమైన నష్టం కలుగుతున్నది గుంటూరు, బెజవాడ, ఒంగోలు, తెనాలి ప్రాంతాలలో ఒక మైలుకు రూ 0-8-0 లు రూ 0-12-0 లు రూ 1-0 0 లు బాడుగ ఇస్తే లారీలు వారుకు రాయిలేక తిరిగిపోయే లారీలు దొరుకుతాయి తెలంగాణా ప్రాంతములో ఇక్కడనుంచి ఏ మిరియాల గూడెమో, హుజూర్ నగరమో వెళ్ళాలంటే ఒక మైలుకు 2 రూ ల కంటె తక్కువ బాడుగకు దొరకనే దొరకవు ఇక్కడున్న రహదారీ సౌకర్యాల కొరతే దీనికి కారణము సృష్టిలో ఉన్నటువంటి డొంక దారులు తప్ప ప్రభుత్వం వేయించిన

metal roads గాని gravel roads గాని యిక్కడ లేవు అందుకని తారు రోడ్లు, సిమెంటు రోడ్లు మీద నడచే లారీలు Depreciation fund కంటే ఏ రహదార్లూ లేనిచోట డొంకదార్లలో నడిచే లారీ కి Depreciation ఎక్కువగా వుంటుంది అక్కడ 10 సంవత్సరాలు పని చేయగలిగిన లారీలు ఇక్కడ రెండు సంవత్సరాలలోనే కమాను బద్దలు విరిగి టైర్లు, ట్యూబులు పోయి ఖాళీ అవడం తప్ప మరేమీ లేదు అందుచేత మనం పన్నువేస్తే, అది పరోక్షంగా ప్రజల మీదనే పడుతుంది దాని వల్ల ఇదివరకు మైలుకు రూ 1–0–0 వున్న చార్జీలు రూ 1–4–0 కి పెరిగే ప్రమాదం వున్నది మారుమూల గ్రామాలలోని రైతులు, వ్యాపారస్థులు తమ సరుకులను హైదరాబాదు వంటి పట్టణాలకు ఎగుమతి చేసుకోవాలంటే ధరలు పెరిగే ప్రమాదం వుంది అందుకని తెలంగాణా ప్రాంతం ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా, అక్కడ రైల్వే సౌకర్యాలు గాని, రవాణా సౌకర్యాలుగాని చాలా తక్కువగా వున్న దృష్ట్యా, యీ పన్నుల వల్ల రవాణా చార్జీలు పెరిగే ప్రమాదం వుంది కాబట్టి పన్నుల సమన్వయ చట్టం తీసుకుని వచ్చేంత వరకూ ఈ చట్టమును తెలంగాణాకు అనువర్తింపచేయకూడదని విజ్ఞప్తిచేస్తూ దీనిని వ్యతిరేకిస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —నేను ఇంకా చెప్పవలసిన జవాబు లేదండి

شری ٹی ۔ انجیا (آرمور) — جناب صدر صاحب ! جو بل سا ٹکس تلنگانہ پر لگانے کے بارے میں پیش ہوا ہے اس کے بارے میں تلنگانے کے عوام کے دلوں میں بہت دنوں سے اس قسم کے ٹکیس کے بارے میں ناراضی ہے اسکا اظہار کیا جا چکا ہے ۔ ہم منسٹروں کو اور بہت سارے لوگوں کو بتاتے آئے ہیں کہ وہ تلنگانے کی دقتوں کو سمجھنے کی کوشش کریں ۔ تلنگانے کے عوام کو آندھرا کے عوام کے ساتھ ملا کر دیکھنے کی کوشش نہ کی جائے تلنگانے کے عوام میں مزید بار کے برداشت کرنے کی سکت نہیں ہے ۔ اس کی وجوہات بہت ہیں ۔ اون میں سے ایک وجہ یہ بھی ہے کہ یہاں کے عوام ترقی یافتہ نہیں ہیں ۔ جس طرح شری واسدیو نائیک نے بتادا ہے کہ کامرس اینڈ انڈسٹریز کے تعلق سے جو گڈس وغیرہ بھیجے جاتے ہیں اس کے تعلق سے آندھرا میں جو صورتیں ہیں یہاں نہیں ہیں ۔ مجھے معلوم ہے کہ فینانس منسٹر صاحب حیدرآباد کو جان چکے ہیں ۔ یہاں کے عوام سے وہاں کے عوام سے ان کو محبت ہے اور یہاں کے عوام بھی ان کو محبت کی نظر سے دیکھتے ہیں اس کے باوجود وہ یہاں کی دقتوں کو بھول رہے ہیں ۔ یہاں کی دقتیوں کو سمجھکر بھی وہ اس بل کو لانا چاہتے ہیں ۔ ایسی صورت میں سوال یہ پیدا ہوتا ہے کہ ہم لوگ اس کے خلاف احتجاج کریں ۔ اس کے سوا کوئی اور صورت نہیں ہے ۔حیدرآباد میں جب میٹرس ( Meter ) لگانے کے بارے میں چرچا ہوئی تو یہاں کے لوگوں نے ہڑتالیں کیں ۔ حیدرآباد میں کوئی چیز بھی لانا چاہتے ہیں تو اس بارے میں اچھی طرح سے غور کرلینا چاہیے ۔ یہ معلوم کرنا چاہیے کہ اس سے کیا اثر پڑیگا ۔ یہاں کے لوگوں میں

ناراضی تو نہیں ہوگی - تبدیلی کرنا ضروری ہے لیکن کن چیزوں میں تبدیلی کرنی چاہیے اور کن میں نہیں اس پر غور کرنا چاہیے - سمجھکر تبدیلی کرنا چاہیے - ایسا کہتے ہوئے میں اپنی تقریر ختم کرتا ہوں -

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—అధ్యక్షా ఈ ఉపన్యాసం తాత్పర్యమైనా కొంచెము చెప్పండి

మిస్టర్ స్పీకర్ :—కొంతమంది ఇంగ్లీషులో మాట్లాడుతారు, కొంతమంది ఉర్దూలో మాట్లాడతారు మనకు తెలుగు, ఇంగ్లీషు ఉర్దూ, హిందీ అనే నాలుగు భాషలునాయి వాటిలో ఏభాషలోనైనా మాట్లాడవచ్చు కాని అనువాదము చేయలేను

శ్రీ బి ధర్మబిక్షం (నక్రేకల్) :—అధ్యక్షా, ఈ బిల్లు ప్రవేశపెట్టేముందు తెలంగాణా ప్రాంతీయ కౌన్సిలుకు దీనిపై అధికారం వుందా, లేదా మీ సమస్య స్పీకరుగారి ద్వారా తెలియజేయాలండీ ఇది ఆర్డరులో వున్నప్పటికీ లేనప్పటికి లారీల పై సర్చార్జీ వేయడం మొదలు పెడితే కొత్తగా లారీలను కొని వ్యాపారం ప్రారంభించినవారు తమ లారీలను పూర్తిగా అమ్ముకునే పరిస్థితులు ఏర్పడుతాయి ఎందుకంటే ఆంధ్రలోని రాజమండ్రి, విశాఖపట్టణం వంటి పెద్ద పట్టణాలు, వ్యాపార కేంద్రాలు తెలంగాణాలో లేవు ఈ మధ్యనే కొంత మంది రైతులు భూములు అమ్ముకుని యిప్పుడిప్పుడే రవాణావ్యాపారం నడపడానికి ఆరంభించారు ఈ తెలంగాణాలో ఒక జిల్లాను మరొక జిల్లాను కలిపే రోడ్లు లేవు ఆ రోడ్లమీద వ్యాపారం నడవడంలేదు ఎక్కడికక్కడ స్థంభించిపోయిన పరిస్థితులు తెలంగాణాలో ఏర్పడ్డాయి ఇటువంటప్పుడు లారీలపై సర్చార్జి వేయడం వల్ల భూమిని అమ్ముకుని లారీలు కొని నడుపుకునే వారు దివాలా తీసి భూమి, లారీ, రెండూ లేకుండా ఇబ్బంది పడే పరిస్థితి ఏర్పడుతుంది మా నల్లగొండ జిల్లాలో చాలావరకు లారీలు ఇదే పరిస్థితిలో వున్నాయి సూర్యాపేట తాలూకాలోని పరిస్థితి కూడా యిలాగే వున్నది, పెద్ద పెద్ద సాహుకార్లు కొంటే కొని వుండవచ్చు, కాని కొన్ని జిల్లాలలో పేదవాళ్ళే లారీ రవాణా వ్యాపారం ప్రారంభించారు మచిలీ పట్టణంనుంచి హైదరాబాదు రోడ్డు జాతీయ రహదారి అవుతుందని మంత్రిగారు చాలాసార్లు చెప్పారు ఆ జాతీయ రహదారి మీద డబ్బు సంపాదించడానికి లారీల speed పెంచినారు కారు కంటె ఎక్కువ వేగంగా పోవడంవల్ల ఎన్నో accidents చేస్తున్నారు ఇన్ని గంటలలో మచిలీపట్నం పోయి తిరిగి రావాలనీ, అట్లా అయితేనే డబ్బు కిడుతుంది, లేకుంటే లేదు అని దీనికి కారణాలు చెబుతుంటారు ఈ సర్చార్జి వల్ల పడే భారాన్ని ఏరకంగా తప్పు కోవాలనే ఉద్దేశ్యంతో వారు ఇంకేమి చేస్తారో తెలియదు అందువల్ల అటువంటి విపత్కర పరిస్థితి లేకుండా పన్నులు వేసే విధానాన్ని జాగ్రత్తగా ఆలోచించాలి ఇంత తొందరగా వేయ్య వలసిన అవసరం నాకు తోచడం లేదు సెలక్టు కమిటీకి దీనిని పంపిస్తే అక్కడ అన్ని పార్టీల ప్రతినిధులు ఆలోచించే అవకాశం వుండేది కాని "మాకు మెజారిటీ వున్నది కదా" అని దీనిని pass చేస్తే చాలా నష్టం కలుగుతుంది ఇది ఆంధ్ర ప్రదేశ్ కు సంబంధించిన దైతే ఒప్పు కుంటాను

ఆంధ్రలో వున్న బిల్లును తెలంగాణాకు extend చేస్తున్నారు తెలంగాణా వారి అభిప్రాయాలను తీసుకుంటామనీ, వారి sentiments ను గుర్తించి చేస్తామనీ, దాని ప్రకారం చేస్తామనీ శ్రీ సంజీవ రెడ్డిగారు, శ్రీ గోపాల రెడ్డిగారు వాగ్దానం చేశారు, పత్రికా గోష్ఠిలో చెప్పారు, శాసన సభలో కూడా చెప్పారు ఇది వరకు దీనిని దృష్టిలో పెట్టుకొని చూచినప్పుడు ఈ బిల్లు pass చేయడం ఎంతవరకు సబబైనది కాదని మరోసారి చెప్పదలచాను

*Mr Speaker* The question is

"That clause 2 do stand part of the Bill"

The motion was adopted

Clause 2 was added to the Bill

*Clauses 3 to 5*

*Mr Speaker* The question is

"That clauses 3 to 5 do stand part of the Bill,,

The motion was adopted

Clauses 3 to 5 were added to the Bill

*Clause 6*

*Sri Pillalamarri Venkateswarlu* Mr Speaker Sir, I beg to move

"In section 3 of the Principal Act in the proviso for the words 'the total permitted daily mileage of which does not exceed fifty miles', substitute the following

"upto a distance of fifty miles"

*Mr Speaker* Motion moved

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —50 మైళ్ళ లోపు వుండే దానిపై సర్చార్జి పడదని మంత్రిగారు చెప్పారు వారి అభిప్రాయము సక్రమముగా వున్నప్పటికీ ఈ బిల్లులో ఆ విధముగా లేదు అందుచేతనే నేను ఈ విధముగా సవరించవలసిందిగా సూచిస్తున్నాను ఆంధ్ర ప్రదేశ్‌లో బస్ రూట్లు, లారీ రూట్లు ఎక్కువని అందరికీ తెలుసు అనేక మంది చిన్న చిన్న రైతులు, అనేక గ్రామాలలో పొలం వున్నవారు ఒక గ్రామమునుండి మరొక గ్రామానికి పండిన పంటలును తీసుకువెళ్ళిన యెడల, ప్రస్తుత పరిస్థితిలో అయితే సర్చార్జి వసూలు చేయబడతుంది.

అందుచేత ఆది లేకుండా చేయటానికి ఒక మినిమమ్ మైలేజీని exempt చేయాలి మేము కమ్యూనిస్టులమనే కారణం చేత మేము చెప్పేది వినకుండా వుండాలని చెవులు మూసుకునేవారు ఈ మంత్రిగారు కాకపోవటంచేత నేను ఈ సవరణ తెస్తున్నాను All India Policy గా ఒక మినిమం మైలేజీని exempt చేయాలని నేను కోరుతున్నాను రైల్వే ఫేర్సులోనే 15 మైళ్ళు లోపు వారికి ఈ additional surcharge పడకుండా చేశాము ఇక్కడ కూడా అలాగే కొన్ని మైళ్ళవరకు exempt చేయాలని మనవి చేస్తున్నాను ఉదాహరణకు బెజవాడనుండి హైదరాబాదుకు వచ్చే బస్సులో ప్రయాణం చేస్తున్న వ్యక్తి నందిగామకు టిక్కెట్టు కొనుక్కున్నా ఈ సర్చార్జి వుండకుండా వుండాలి 1952వ సంవత్సరములో ప్రధానమైన రాజకీయపార్టీగా వున్న కాంగ్రెసు పార్టీ—ఆరోజుల్లో సోషలిజమును ఆమోదించని పార్టీ కూడా ఈ నాడు సోషలిజమును ఆమోదిస్తున్నామని చెపుతున్నారు దానికి తార్కాణంగా అన్నీ కాకపోయినా, కనీసం కొన్నిటిలోనైనా ఆదర్శంగా వుండాలి అందుచేత మినిమమ్ మైలేజీ వుండాలనే విషయం మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను 50 మైళ్ళ లోపు వారిని మినహాయించి ఆ పై ప్రయాణం చేసేవారిపై surcharge వసూలు చేయాలని నేను amendment తీసుకు వచ్చాను తక్కువ దూరం ప్రయాణం చేసేవారికి ఈ సౌకర్యం కలుగ జేయాలి అలాగే లారీలపై సామాను తీసుకుపోయే విషయంలో కూడా అట్టి సౌకర్యము కలుగ జేయాలి ఆ ఉద్దేశంతోనే నేను ఈ amendment ను తీసుకు వచ్చాను ఉపన్యాసాలు చెప్పటంవల్ల ప్రయోజనం లేదని ఈ సవరణను ఆమోదించి ఆచరణలో పెట్టవలసిందిగా మంత్రిగారికి చెపుతున్నాను 50 మైళ్ళ లోపువారికి ఇది వర్తించదని మంత్రిగారు చెప్పారు దానినే బిల్లులో వుంచటానికి వీలుగా నేను తెచ్చిన ఈ amendment ను మంత్రిగారు ఆమోదించాలని కోరుతూ amendment ను move చేస్తున్నాను

శ్రీ డి. నరసయ్య (హుజూరాబ్‌నగర్) —అధ్యక్షా! Original Bill లోనే 50 మైళ్ళు లోపు నడిచే లారీలకు ఇది వర్తించదు నేటటువంటి దానిని వివరించవలసి యుంటుంది 50 మైళ్ళలోపు ప్రయాణంచేసే లారీలు అంటూ ఎక్కడాలేవు అనే విషయం మంత్రిగారికి తెలుసును అనుకొంటాను పోతే యిప్పుడు, మనం ఒక tax గురించి, లేక దాని మీద అదనంగా పన్నువేసే సమస్యగురించి చర్చిస్తూన్నప్పుడు, ఆచరణకువచ్చే ఉద్దేశ్యముతో మనము సవరణను పరిశీలించాలని తమద్వారా మంత్రిగారికి మనవిచేస్తున్నాను ఉదాహరణకు తెలంగాణా ప్రాంతంలో చూచినట్లయితే కొద్దికొద్ది మొత్తాన్ని లారీల పెట్టుబడి పెట్టి లారీల ద్వారా, తమవ్యాపారాన్ని నేరుగా, షాహుకార్ల ద్వారా కాకుండా, చేసుకొనే రైతులున్నారు. తమకు అందుబాటులో ఉన్న ఏ ఖమ్మం మార్కెట్టుకో, జగ్గయ్యపేట మార్కెట్టుకో, లేకో ఒకే పుట్టెడు శనక్కాయలు వేసుకొని నలుగురైదుగురు రైతులు ఒక లారీని కంట్రాక్టుకు తీసుకొని వ్యాపారం చేసుకొనేటటువంటి పరిస్థితులున్నాయి ఈ సవరణ ప్రకారం అంగీకరించినట్లయితే, యిలాంటి రైతాంగంమీద అదనంగా భారము పడకుండా ఉంటుంది. అందుకే

సమే, మేము ఈ సవరణను తమపరంగా తీసుకు వస్తున్నాము మేము కోరేది మంత్రిగారు చెప్పి నట్లు పెద్దపెద్ద లారీ వ్యాపారస్తులకు, బాగా డబ్బు సంపాదించినవారికి దీనివల్ల ఏదో పెద్ద నష్టంవస్తుందని మేము వ్యతిరేకించేది లేదు దీనివల్ల రైతాంగంమీద పన్ను పడుతుందని మనకు తెలుసు సామాన్య రైతాంగం, కొద్దికొద్దిగా వ్యాపారం చేసుకొనే షావుకార్లు, చివరకు మా హుజూర్‌నగర్ పట్టణంలోఉండే షావుకార్లలో ఏ ఒక్క షావుకారు ఒక్కసారి ఖమ్మం నుంచిగాని బెజవాడనుంచిగాని, లారీమొత్తంగా సామాన్లు తీసుకొనరాడు ఇట్లాంటి చిన్నచిన్న **towns** మనకు తెలంగాణాలో చాలాఉన్నాయి సూర్యాపేటకు తీసుకొని వెళ్లాలంటే 4, 5 మంది షావుకార్లు కలసి, ఒక్కొక్కప్పుడు మొత్తం లారీ లోడ్ కూడ తీసుకోలేకుండా ఉన్నారు ఏ కోదాడదగ్గర దింపేలాగో, ఏ చిలుకూరుదగ్గర దింపేలాగో, వ్యాపారం జరుగుతోంది ఇటువంటి చిన్నచిన్న షావుకార్లు సంగతి తెలంగాణా గ్రామాలకు వెళ్లినట్లయితే తెలుస్తుంది అందుకోసమే, చిన్నచిన్న రైతాంగంమీద, చిన్నచిన్న వ్యాపారస్తులమీద ఈ భారం పడకుండా ఈ ఎమెండుమెంటును మంత్రిగారు తప్పకుండా స్వీకరించాలని కోరుతున్నాము. ఇది పెద్దపెద్ద షావుకార్లమీద, ఏ ఆలపాటి కుటుంబరావు వంటివారిమీదో పడడంలేదు అంటే ఒక ఉదాహరణకు చెప్పేను అనుకోండి ఇట్లాంటి షావుకార్లు చాలమంది ఉన్నారు పెద్దపెద్ద షావుకార్లు 20, 25 లారీలు పెట్టుకొని వ్యాపారం చేసేటటువంటివాళ్లమీద పడడంలేదు ఈ పన్నులవల్ల అందరిమీద భారము పడుతోంది అందువల్ల 50 మైళ్ళ లోపున కంట్రాక్టు చేసినట్లయితే, అదినలుగురు కలసిచేసినా అయిదుగురు కలసి వేసినా, దానికి మాత్రం మినహాయింపు ఉండాలని కోరుతున్నము

డాక్టరు బి గోపాలరెడ్డి - ఇప్పుడు బస్సుకుసంబంధించినంతవరకు ఈ ఎమెండుమెంటు ఒప్పుకుంటే నూటికి 95 మంది పైగా, 25 మైళ్ళు లోపుగా ప్రయాణం చేసేవారని మా లెక్కలను బట్టి తేలుతున్నది ఇక లారీల విషయంలో 50 మైళ్ళు లోపులో సరకు తీసుకుపోయే దానికి **tax** లేదు ఆ పైన దానికి **tax** ఉంది చిన్న చిన్న వాళ్ళకు వేయవద్దు పెద్ద పెద్ద వాళ్ళకు వేసుకోండి అన్నారు పెద్దవాళ్ళకు ఒక **tax** చిన్నవాళ్ళకు మరొక **tax** 50 మైళ్ళ లోపు ఒక **Tax** ఈ విధంగా చేస్తే **Administration** కు ఎంతఇబ్బంది అవుతుందో తెలుసుకోవాలి మేము అనుకునేది లారీ వాళ్ళు అంతా **compound** చేసుకుంటారని ఈ లెక్కలతో వాళ్ళు తంటాలు పడడం, ఎందుకు, నెలకు 22 రూపాయలు మాకు అదనంగా యివ్వండి, సర్చార్జీ లెక్కలు చూపించడం అక్కరలేదు, **compound** చేసుకొనడానికి వీలు అవుతుంది అంటున్నాను **compound** చేసుకోడానికి వీలుగా వున్నప్పుడు 50 లోపు ఒకటి 50 పైన ఒకటి, చిన్న వాళ్ళకు ఒకటి, పెద్దవాళ్ళకు ఒకటి అనేటటువంటి మాట లేకుండా ఉంటే మంచిది ఇది ఆంధ్రలోవున్నటువంటి విషయమె ఇది **Bus Passengers** కు చాలా ప్రమాదకరం కూడా అందువల్ల అంగీకరించ డానికి వీలు లేదు

*Mr Speaker* The question is

"In Sections 3 of the Principal Act in the proviso, for the words 'the total permitted daily mileage of which does not exceed fifty miles' substitute the following

'upto a distance of fifty miles'"

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I demand a division

The House then divided

Ayes 21, Noes 57,

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* Sir, I beg to move

"Add the following proviso to Clause 6

'Provided that no tax shall be levied on any passenger luggage or goods carried in a stage carriage if the distance for which the passage booked is only twentyifive miles'"

*Mr Speaker* Motion moved

*Dr B Gopala Reddy* The Government cannot agree to this amendment

*Mr Speaker* The question is

"Add the following proviso to Clause 6

'Provided that no tax shallbe levied on any pass nger luggage or goods carried in a stage carriage if the distance for which the passage booked is only twenty ifive miles'"

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move

"Add the following proviso to Clause 6

'Provided that no tax shall be levied on passengers in case the existing rates of charges are four naye paise and more'"

*Mr Speaker* Motion moved

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—అధ్యక్షా, ఈ సర్చార్జి అనేది 1952 సంవత్సరంలో మొట్టమొదట ప్రవేశ పెట్టినప్పుడు వున్నటువంటి existing minimum rates ఏమాత్రమూ పెరగకుండా వుండాలనే clause పెట్టి ఏడు నామూలు పైసల కంటె (ఏడుపైసల లోపే)–సర్చార్జి కలుపుకొన్నప్పటికీ—ఎక్కువ పెరగ కూడదనే ఉద్దేశంతో బిల్లును pass చేయడం జరిగింది. అందువల్ల ఎంత సర్చార్జి పడినప్పటికీ అదీ కూడా Bus Operators భరిస్తూ వచ్చారు. కాని హైకోర్టు తీర్పు Bus Owners కు అనుకూలంగా రావడంవల్ల అదికూడా ప్రయాణీకులమీదే వేస్తున్నారు. Passengers మీద ఇప్పటికే రేట్లు చాలా ఎక్కువగా వున్నాయనేది మనం మరచి పోకూడదు. ఇప్పుడున్నటువంటి రేట్లు చాల ఎక్కువగా వుండిపోతున్నాయి. వాటిని తగ్గించాలనే యోచన ఎక్కడా లేదు. ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మంత్రివర్గం దృష్టికి తీసుకురాదలచుకున్నాను. "రేట్లను ఎక్కువ చేయక పోతే ఎట్లా? తక్కువచేస్తే ఆదాయం ఎట్లా వస్తుంది?" అనేటటువంటి విషయాన్ని తీసుకువస్తున్నారు. తెలంగాణాలో వున్నటువంటి రేట్లను తగ్గిద్దామా అంటే ఆదాయం పోతుంది గనుక తగ్గించే మాట నా చెవికి తీసుకురావద్దని మనమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు చెబుతున్నారు.

[*Sri S. Ranganatha Mudaliar, in the Chair*]

దీనికి ఒక్క విషయం చెబుతున్నాను. హైదరాబాదులో రేట్లు ఎక్కువ, మదరాసు రాష్ట్రంలో కాని మన రాష్ట్రంలో కాని యీ Motor Vehicles భరిస్తున్నటువంటి పన్నులు ప్రపంచంలోని ఇతర దేశాలలో కంటే కూడ ఎక్కువ వున్నప్పటికి కూడ అంత తక్కువ ఆదాయం రావడం ఎందుచేత జరుగుతోంది? ఆ విషయం ఒక్కసారి ఆలోచించాలని కోరుతున్నాను. దానిని విచారణ చేయడానికి చాగ్లా కమీషన్‌లాంటి దానిని నియమించాలి. ఎందువల్ల, ఎక్కడ యీ అన్యాయం, యీ కుంభకోణం జరుగుతూందో విచారణ చేయవలసిన అవసరం చాలావుంది. ఇప్పుడు Motor Transport nationalisation చేయబోతున్నారు. Nationalisation చేస్తూంటే operators కాని ప్రజలు కాని ఏమనుకుంటారో గమనించాలి. తెలంగాణాలో వీరు ఏమాత్రం లాభం సంపాదించారు? ప్రభుత్వ మేమిటి? నడవడమేమిటి? వారివల్ల ఏమౌతుందని సవాలు చేయడం కూడా జరుగుతున్నది. అసలు ప్రజల్లో ఒక రకమైన విశ్వాసం, నమ్మకం కలగచేయాలి. తప్పని సరిగా ఇక్కడి ఆర్. టి. డి. విషయాన్ని గురించి ఒక విచారణ చేయించవలసిన అవసరం మాత్రం చాలావుంది. ఇక్కడ వున్న ప్రభుత్వపు బస్సులు డీసిల్ ఆయిల్‌ను ఎక్కువ తాగుతున్నాయా? లేక ఎందుచేత ఖర్చు ఎక్కువ అయిపోతోంది? ఎందువల్ల tyres ఎక్కువగా అరిగి పోతున్నాయి? ఖర్చులు ఎందువల్ల పెరిగి పోతున్నాయి? అనే విషయాలు ఆలోచించాలి. workers జీతాల విషయం చూద్దాము. మద్రాసు రాష్ట్రంలో కూడా బస్సులను ప్రభుత్వం నడుపుతోంది. అక్కడి లెక్కలన్నీ చూచాను. మద్రాసులో సాలుకు సుమారు రూ. 30 లక్షల

లాభం వస్తూంటే మన హైదరాబాదులో ఎందువల్ల రాలేక పోతోంది? ఎందువల్ల మనం ఈ ప్రాంతంలో లాభం సంపాదించలేక పోతున్నాం? దర్యాప్తు చేయించనిదే మాత్రం ఈ విషయాలు తెలియవు ఎవరైనా అభ్యంతరాలు చెబుతున్నప్పటికైనా సరే, ఎంతటి powerful Magnet దీనిని వ్యతిరేకిస్తున్నప్పటికీ కూడా యీ దర్యాప్తు చేయించినప్పుడే యీ విషయం బయట పడుతుంది లేక పోయినట్లయితే మాత్రం ఈ కుంభకోణం, కుంభకోణం గానే ఉంటుంది ఎంత డబ్బు పెట్టినప్పటికైనా సరే దానినిమాత్రం మనం ఉద్ధరించ లేము, దానిని మనం, మన ఆంధ్రప్రాంతానికి కూడా విస్తరింప చేయబోతున్నాం ఈ పరిస్థితులలో ఈ దర్యాప్తు తప్పకుండా జరిగితీరాలి అప్పుడే ప్రజలకు విశ్వాసం కలుగుతుంది మాడబ్బు దుర్వినియోగం కాకుండా ప్రభుత్వం చూస్తుందనే నమ్మకం ప్రజలలో కలగాలి ఇప్పుడు అనేక రకాలైనటువంటి వినికిళ్ళు వున్నాయి కొన్నిచోట్ల టిక్కెట్లు సరిగా అమ్మడంలేదని అంటున్నారు మరియు అనేక రకాలైనటువంటి ఆరోపణలు వున్నాయి ఇవి అన్నీ కూడా ఆపుదల చేస్తేనేగాని యీ ఆర్ టి డి అనేది సరిగా నడవదు అలాంటివన్నీ వున్నప్పుడు ఎందువల్ల మనకు డబ్బు నష్టం రాదు? ఎందుకు నష్టం వస్తున్నది? ఎక్కువ లాభాలన్న మనము సంపాదించలేక పోవడానికి కారణం ఏమిటి? అని ఆలోచించుకోకుండా, మనం రేట్లనే ఎక్కువచేస్తే సరిపోతుందని ఆలోచించడం మాత్రం చాలా పొరపాటని చెబుతున్నాను అందువల్ల, మద్రాసులో ఏరేట్లు ఐతే వున్నాయో ఆ రేట్లకు తగ్గించి వేయాలి Experiment చేసి చూడాలి అప్పుడే తెలుస్తుంది అక్కడ ఎందువల్ల లాభాలు వస్తున్నాయి? మనం ఎందువల్ల లాభం పొందలేక పోతున్నాము అన్నది పరిశీలించాలి కార్మికుల జీతాల విషయం విచారించినప్పుడు, వాటిని తగ్గించాలనే ఉద్దేశం ఎంతమాత్రం వుండరాదు మనం ఎక్కువ జీతాలు ఇచ్చినప్పటికీ వాటిని నష్టంగా పరిగణించడానికి కూడా వీలు లేదు ప్రభుత్వం ప్రజల కోసం వున్నప్పుడు, వారియొక్క సౌకర్యాలను ఎక్కువ చేయడానికే పూనుకోవాలి కాని తెలంగాణా లో జీతాలు ఎక్కువగా వున్నాయి కాబట్టి వాటిని తగ్గించాలనే వుద్దేశ్యం ఎంతమాత్రం పనికి రాదు రేపు ఆంధ్రలో బస్సులను జాతీయం చేసినప్పుడు అక్కడ వుండే కార్మికులకు జీతాల్ని పెంచకపోతే వారిలో ఒక రకమైనటువంటి అసంతృప్తి అవిశ్వాసం వస్తాయి ఇప్పటికే ఒక రకమైన అయిష్టత ప్రజల్లో వుంది ప్రభుత్వం బస్సులను నడుపుతుందంటే ప్రజల్లో విశ్వాసం లేదు అందువల్ల ఇవన్నీ కూడా మనము చూడవలసిన అవసరమువుంది యివన్నీ చేయనిదే మనము వన్నులను ఊరికే పెంచుకుపోతే ఎంతమాత్రం ప్రయోజనం వుండదని నేను చెబుతున్నాను ఏ పరిస్థితులలోనూ సర్‌చార్జీలన్నీ కలుపుకొని మైలుకు నాలుగు నయాపైసలకంటే ఎక్కువ వేయకూడదు ఇక్కడున్న ఆర్ టి డి యొక్క వ్యవహారాలను పరిశీలించేందుకు ఆ మధ్య ఒక కమిటీని వేశారు దానిలో ఒకరిద్దరు శాసనసభ్యులను కూడా వేశారు ఐతేమి పాపమో కాని కొంచెము విమర్శనా దృష్టితో చూస్తే opposition నుంచి కూడా కొందరిని ఆ కమిటీలో ఎందువల్లవెయ్యలేదో నాకు బోధపడ్డంలేదు

**Dr B Gopala Reddy* The hon Member is going out of the scope of the Bill Road Transport and other connected matters can be raised during the budget discussion. We are

concerned here only with the specific point whether tax can be levied or not

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ఇప్పుడు పన్ను ఎక్కువ చేయాలంటున్నారు అయితే ఆడబ్బు సరిగా ఖర్చు పెడుతున్నారనే నమ్మకం వుండాలి కదా? కాబట్టి ఇందుకు వాంఛూ కమీషన్ లాంటి ఒక కమీషన్ వెయ్యాలనడం కూడా సక్రమమైనదే కొన్ని కులాల పరిస్థితులను గురించి కూడా చెప్తాను మంత్రివర్గం ఏ బిల్లును తెచ్చినప్పటికైనా సరే ఆ బిల్లు సందర్భంలోనే ఇది చెప్పకపోతే వాటిని ఎప్పుడు తెచ్చుకోగలుగుతారు? ఎప్పుడు సవరించుకోగల్గుతారు? అందువల్ల నేను ఈ సందర్భములోనే ముఖ్యంగా ఆ పంక్తులను గురించి కూడా యీ బిల్లు సందర్భంలో చెప్పడం appropriate గా వుంటుందనే ఉద్దేశ్యంతోనే యీ విషయాలను మంత్రివర్గం దృష్టికి తీసుకు వస్తున్నాను ఈ రకంగా నిర్దిష్టం ఉద్యోగాలు కల్పించినంత మాత్రాన వచ్చే ఉపయోగం ఏమీ వుండదు విమర్శనా దృష్టితో వున్నటువంటి విషయాలను సక్రమంగా నడిపించడానికి వీలైనటువంటి వారిని తప్పకుండా ఇక్కడ నుంచి తీసుకున్నప్పుడే అవిఅన్నీ జరుగుతాయి అందువల్ల ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు నాలుగు నయా పైసలకు ఎక్కువ వున్నట్లయితే దాని మీద సర్చార్జి లేకుండా చేయాలన్నదే మాయొక్క ప్రతిపాదన అలాచేస్తే తెలంగాణాలో రేట్లు తగ్గుతాయి ఆంధ్రలో కూడా Nationalisation చేసిన రేట్లు తగ్గుతాయి ఊరికే ప్రజల మీద పన్నులు వేసుకుపోతే సంపాదు ఒక ప్రక్క collections సాగించండని ఉద్యోగస్థులను హెచ్చరిస్తున్నారు సామాన్య ప్రజలకు ఇబ్బందిని తొలగించే నిమిత్తం కనీసం యీ amendments పైనా సరే accept చెయ్యాలని కోరుతున్నాను

*Sri M Nagi Reddy* I beg to move

"Add the following at the end of Clause 6

'Provided no tax shall be levied on passengers in case the existing rate of charges are four naye paise and more per mile'"

*Mr Chairman* — Motion moved

శ్రీ ఎమ్. నాగిరెడ్డి —అధ్యక్షా, ఈ amendment పై ఏవిధమైనటువంటి పెద్ద చర్చ లేకుండా మంత్రిగారు అంగీకరిస్తారేమో అనుకున్నాము ఈ బిల్లుయొక్క objects and reasons లో వ్రాసినటువంటి దానిని బట్టి తెలంగాణా ప్రాంతంలో ఈ పన్ను passengers మీద వెయ్యడం అనేటటువంటి సూచన స్పష్టంగా లేదు Rules లో మాత్రం దీనిని స్పష్టపరుస్తామన్నారు వారు చెప్పేటటువంటిది ఆచరణలోకి రావడానికి గాను దానిని బిల్లులోనే పెట్టడం మంచిదని మా అభిప్రాయము ఇక్కడ ఉన్నటువంటి రేట్లు చాలా ఎక్కువ కాబట్టి తెలంగాణా ప్రాంతంవారి మీద వెయ్యము అని ఆంధ్ర ప్రాంతంలో తక్కువ కాబట్టి అక్కడి passengers మీద వేస్తామని అనవచ్చు ప్రస్తుతానికి

ఇలాగ చెప్పి తరువాత తెలంగాణాలో కూడా పెంచుతామనే ఉద్దేశ్యం ఉంటే, దానికి మనము ఏమీ చెప్పలేము రేట్ల విషయంలో నాలుగు నయా పైసలో, ఎంతో పెట్టుతామని ప్రభుత్వం చెప్పుతున్నది కూడా ఆంధ్రలో ఏడు పైసల రేటు వున్నది కాబట్టి అక్కడ మేము surcharge రూపములో passengers ల మీద వేస్తామన్నారు తెలంగాణాలో దాదాపు పదకొండు పైసలు ఉంది కాబట్టి ఇక్కడ వెయ్యమని చెబుతూ వచ్చారు రేపు అక్కడకి వచ్చేటప్పుడు నాలుగు నయాపైసల చొప్పున పెట్టుతామని చెబుతూ యున్నారు అంటే దాదాపు అక్కడ వున్నటువంటి రేట్లకంటే కూడా ఎక్కువ కట్టేటటువంటి పరిస్థితులు వస్తాయి మరి ఈ బిల్లును తెలంగాణా ప్రాంతానికి రేపు Rules చేసేటప్పుడు అనువర్తింప కూడా చేస్తామంటున్నారు ఆంధ్రలో రేటు నాలుగు నయాపైసలు వేస్తే nationalise చేసినప్పుడు అదనపు పన్ను ఆంధ్రప్రాంతంలో పడేటటువంటి ప్రమాదం వుంది అందుకని ఒక వైపు ఏడు దమ్మిడీలు వున్నటువంటి దానిని నాలుగు నయా పైసలలోకి ఎక్కువ చేస్తూ ఉన్నారు Surcharge వచ్చేటప్పటికి మళ్ళీ ఎక్కువ చేసే ప్రమాదం వున్నది ఆంధ్ర ప్రాంతంలో అదనపు పన్ను కట్టుతూ వున్నారు కాబట్టి తెలంగాణాలో కూడ ఎందుకు పన్ను కట్ట కూడదని చిన్న బిల్లు ప్రవేశ పెట్టుతూ యున్నారు దీని వలన వచ్చే ఆదాయం చాలా తక్కువగానే ఉండవచ్చు ఇక్కడ వున్నటువంటి పరిస్థితులు కూడ గమనించాలి ఒక వైపున జాతీయం చేయాలంటున్నారు ప్రతిపక్షాలు, ప్రభుత్వం అందరూ కూడా పరిశ్రమలను క్రమేపి జాతీయము చేయాలని అనుకుంటున్నారు దాన్ని బలపరుస్తున్నాము అలాంటి పరిస్థితులలో ఇప్పుడిప్పుడే ఈ పన్నులు పెంచడం మంచిది కాదు ఇది ప్రజలకు నష్టము అని ప్రజలకు చూపించేటటువంటి ధోరణిలో బస్సు యజమానులు చెప్పడానికి ఈ బిల్లు ఉపయోగ పడుతుంది అలా చేసేటటువంటి ప్రయత్నాలద్వారా వేసేటటువంటి కరపత్రాల ద్వారా రాయబారాల ద్వారా ప్రజలను రెచ్చగొట్టే ఆందోళనలు జరుగుతున్నప్పుడు పన్ను పెంచడం మంచిది కాదు నాలుగు నయా పైసల నుంచి ఏడు నయాపైసలు పెంచుతున్నారు కాబట్టి దానిని ప్రజలను వ్యతిరేకించమని చెప్పే పరిస్థితులు వస్తాయి తెలంగాణాలో పదకొండు దమ్మిడీల రేటు, దాదాపు అయిదు నయా పైసలు రేటు, వున్నప్పటికీ కూడా ఏడు లక్షల రూపాయలు మాత్రమే లాభం అని చెప్పుతున్నారు ముప్పది లక్షలు ఒక్క మదరాసు సిటీలోనే దొరుకుతుందంటే ఆంధ్ర ప్రాంతంలో ఈనాడు బస్సు యజమానులు ఇచ్చే జీతాలకంటే driverలకు conductorలకు cleaners కు ఎక్కువ ఇస్తూ కూడా ఒక్క City లోనే వాళ్ళు ముప్పై లక్షల లాభం గడిస్తున్నారు జీతాలు పెంచలేమని ముఖ్యమంత్రిగారు ఇక్కడ Floor మీద చెప్పుతూ, జీతాలు ఒక్కటే కాదు ఈ లాభం తగ్గడానికి ఏడు లక్షలే రావడానికి తదితర కారణాలు కూడా వున్నాయి, వాటిని పరిశీలిస్తున్నాము అన్నారు ఒక వైపు ఆంధ్రప్రాంతంలో చూస్తే $7\frac{1}{2}$ దమ్మిడీ లోటి Bus లను నడుపుతూ మరి విపరీతమైనటువంటి లాభాలు పొందుతూ వున్నారు గుంటూరు జిల్లాలో శివయ్యగారు ఒక బస్సుతోటి Start అయి ఇప్పుడు 30, 40 బస్సులతో కొన్ని లక్షలు రూపాయలు సంపాదించారు $7\frac{1}{2}$ దమ్మిడీల లోటి వాళ్ళు లక్షల రూపాయలు సంపాదించ గలుగుతుంటే మరి ఒక వైపున ఇన్ని బస్సులు పెట్టుకొని పదకొండు దమ్మిడీలు charges వసూలు చేస్తూ లాభాలు రావడం లేదంటే దానిలో లోటు ఎక్కడ వున్నది? ఈ Leakage ఎక్కడ వుంది? ఎందుకు నష్టం

వస్తున్నది? మొదలైనవే చూడాలి మీకు లాభం తక్కువ కాబట్టి ఈ రేట్లు పెంచుతాము లన్నారు ఒక వైపు బస్సు యజమానులు గవర్నమెంటు బస్సులు stage, stage వద్ద ఆగవు, మా ఊరు దగ్గర ఆగవు, రేట్లు ఎక్కువగా పెరుగుతవి అని అనేక రకాల ప్రచారాలు చేస్తున్నారు జాతీయం చేయడం తప్పని ప్రజలలో ప్రచారం చేసే దాని వల్ల ఇబ్బందులు కలుగుతాయి రేట్లు పెరుగుతాయనేటటువంటి ఉద్దేశ్యాన్ని కల్గించడం ద్వారా nationalisation వద్దని బస్సులు వద్దని ఆందోళన చేయించాలని, మళ్ళీ వాళ్ళు బస్సులను నడపాలని యత్నిస్తున్నారు ఈ రేట్లు పెంచుతూ ఉండడమువల్ల ప్రజలలో అసంతృప్తి కలుగ వచ్చు ఇంతమంది Drivers అవసరం లేదని, జాతిపరం చేయకూడదని అన్నవాంఛ పరోక్షంగా ప్రభుత్వం ఈ బిల్లుద్వారా బలపరుస్తున్నది ఈ విషయముల నన్నింటిని దృష్టిలో పెట్టుకొని నాలుగు నయాపైసలు ఉండే చోట్ల ఈ అదనపు పన్ను పడదని వాగ్దానం చేయవలెనని కోరుతూ సెలవు పుచ్చుకుంటున్నాను

వావిలాల గోపాలకృష్ణయ్య — అధ్యక్షా, ఒక Executive orders ఏనాడుపడితే ఆనాడు మోటారు యజమానులు కిరాయిపెంచడానికి అవకాశం లభించవచ్చు దానిని నిషేధించి Control చేయడానికి ఈ amendment పెట్టాం ఇంతవరకు ఆంధ్ర ప్రాంతంలో ఏడున్నర పైసలుండేవి దానినియిప్పుడు నాలుగు నయాపైసల క్రింద మారుస్తూ పత్రికలలో ప్రకటనచేశారు తెలంగాణాలో పదకొండు పైసలు వసూలు చేస్తున్నారు ఇక్కడ ఎక్కువగా ఉన్నదికనుక ఈ రేటును అక్కడకుకూడా ఎగువలచేస్తే దానివల్ల చాలా మార్పు వస్తుంది Ex cut ve order ద్వారా గవర్నమెంటు rate మార్చడానికి వీలుఉందా లేదా అనే ప్రశ్న ఉన్నది ఒక నెలరోజుల క్రిందట "మేము రేట్లు మార్చివేస్తున్నాం మీకేమైన అభ్యంతరం ఉంటే చెప్పండి" అని G.zette లో notify చేశారు ఇదే Execut ve order కనుక దానిమీద ఎవరన్నా అభ్యంతరాలను తెలుపుకోవాలి కాని అది Publish అయిన తారీఖునుంచి లెక్కవేస్తే 22 రోజుల తరువాత అదివచ్చింది. ఒక్కరికేకాదు, అన్ని ఆఫీసులకు ఆవిధంగా ఆలస్యంగా పోస్టుచేయడం జరిగింది అది ఉద్దేశపూర్వకంగా జరిగిందని నేను అనుకోను కాని ఈ గెజెటు లేటుగా రావడం జరుగుతున్నది కనుక ఎవరన్నా ఈ 15 రోజులుమాకు time యిచ్చాం? ఈ 15 రోజులలో నేను అభ్యంతరం చెప్పుతున్నాను అని వ్రాస్తే తేదీ అయిపోయిన తర్వాత వచ్చిందని చెప్పుతారు ఒక ప్రక్క గెజిటు ఆలస్యంగా వస్తుంది రెండవప్రక్క మాత్రం exemption లో ఆలస్యం లేకుండా జరిగిపోతుంది ప్రస్తుతం ధరలు పెంచడంవల్ల ప్రజానీకం యిబ్బంది పడుతుంది. వారికి సౌకర్యంకలుగచేసే బదులు పన్నులు, సర్చార్జీలు విధించుతున్నారు మోటారు యజమానులమీద పన్ను వేస్తుంటే దానికి మీరు ఎందుకు అభ్యంతరము చెప్పుతున్నారని ఆర్థిక మంత్రిగారనవచ్చు ఇది ముఖ్యంగా మోటారు ప్రయాణీకులకు సంబంధించింది దీనిని బస్సుల యజమానులనుండి నిజంగా వసూలుచేస్తే ఎవరికి ఏమీ బాధవుండదు గోపాలరెడ్డి గారు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఆ చట్టం ప్యాసుఅయినదని అన్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి — ఆ కథలన్నీ ఎందుకు ఇప్పుడు? దీని సంగతిగురించి చే గౌరవ సభ్యులు మాట్లాడితే బాగుంటుంది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య — మంత్రిగారు mention చేసారు కాబట్టి చెబుతున్నాను అసలు సమస్య మీద ప్రత్యేకంగా పోతుంది అందువల్ల వద్దంటే అంటున్నారు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — Point of Order Sir, ఒక సభ్యుడు మాట్లాడుచున్నప్పుడు వద్దంటే చెప్పే హక్కు, చెప్పించే హక్కు మీకున్నంటే మంత్రిగారు ఆ హక్కును భుక్తము చేసి కాని ఒక సభ్యుని ఆ విధంగా అక్కడ నుండి శాసించడం సబబేనా?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య — మొట్టమొదట surcharge వేస్తామని బిల్లు తయారుచేశారు అది సెలెక్టు కమిటీకి పంపించారు అక్కడ లాంగ్ డిస్టెన్స్, ఒక్కొక్కదానిమీద గూడా వేస్తే బాగుంటుందనే ఆలోచనలు వచ్చాయి అందువల్ల ఆ బిల్లును రద్దుచేస్తున్నామన్నారు తర్వాత యింకో బిల్లు తీసుకువచ్చారు దానిని ప్రత్యక్షం తీవ్రంగా ప్రత్యేకంగా తీసుకువచ్చి అమలు జరిపారు ఇది యితర రాష్ట్రాలలోగూడ యున్నదని ఆర్థిక మంత్రిగారు చెప్పినారు వారి ఆర్థిక విధానం, వారు ప్రజలకుచేస్తున్న యితర సౌకర్యాలను గుర్తుపెట్టుకొని ఆలోచిస్తే ఈ పన్నులవల్ల ఏమైనా ప్రయోజనం వుండవచ్చు ఇవ్వాళ over load చేసేవారిని గురించి అడిగేవారు లేరు ఆ మొనాపలీగావున్న వాటిని nationalise చేస్తున్నామని అంటున్నారు మా జిల్లాగూడ తెలంగాణాను అనుకొనియుండడం కాబట్టి అక్కడ motor transport ను nationalise చేస్తున్నారేమో అని ఆశించాను కాని ఏమీలేదని కబుర్లు వస్తున్నవి ఈ సర్చార్జి మొత్తం బస్ యజమానులు వసూలుచేసే కరాయి మీద వేస్తున్నారా? లేక వారికిచ్చే పూర్తి ఆదాయంమీద వేస్తున్నారా?

మొదట ఈ బస్ యజమానులు హైకోర్టుకువెళ్ళి హైకోర్టు ఏదో రూలింగు యిచ్చిందని passengers నుండి surcharge వసూలుచేయ మొదలు పెట్టారు తర్వాత ఆ పూర్తికి వెళ్ళేటప్పుడల్లా వసూలుచేయ మొదలు పెట్టారు మంగళగిరి వంచి గుంటూరుకు బస్సు ఉండేది అది గుంటూరునుండి బయలుదేరి మంగళగిరికి, అక్కడనుండి బెజవాడకు వచ్చేది బస్సుటికెట్టును మాత్రం ఒకటేకాని వారు Passengers ను గుంటూరునుండి మంగళగిరికి, మంగళగిరినుండి బెజవాడకు రెండుసార్లు బుక్ చేసి రెండుకానులు వసూలు చేసేవారు ఇదీ మొత్తం ఒకటే ప్రయాణం సర్చార్జి రెండు కానులు ఎందుకు వసూలు చేస్తున్నారని మేముఅడిగితే వినేవారు ఎవ్వరులేరు ఆఫీసర్లుకు చెప్పినా ప్రయోజనంలేదు కనుక ఇలా రెండుసార్లు వసూలు చేసేవాంటి కంట్రోలుచేసే అధికారం Traffic Board ది మాదికాదని వసూలుచేసే వారంటారు అంవాటిని నిమ్మళ్యంచేసే పద్ధతి ఏమైనా ఉందా? లేదా? దీనినిగురించి మనము తీవ్రంగా ఆలోచించాలి, ఈ సవరణలోయున్నదంతా నాలుగు నయా పైసలకు మించినచో surcharge వసూలు చేయకూడదు అనేది మాత్రము ఎప్పుడుపడితే అప్పుడు taxes పెంచే అధికారం executive చేతులలో ఉంది అది లెజిస్లేచరుకు

ఎక్కడా రాదు కనుక తెలిస్కోప్‌లో ఉన్నటువంటి మంచిని గుర్తించి ప్రభుత్వం సమగ్రంగా ఆలోచిస్తుందని, ఆ దృష్టితో ప్రభుత్వం దీనిని అంగీకరించవలెనని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —అధ్యక్షా, ఇది తెలంగాణకు సంబంధించిన విషయంకాదు కేవలము బస్సు ఛార్జీల విషయం మాత్రమే తెలంగాణాకు సంబంధించినంత వరకూ ఇప్పటికే ఒన్ రేట్లు ఎక్కువగా ఉన్నవి కాబట్టి ఇక్కడ సర్చార్జీలు విధించడం జరుగదు ఇప్పుడు రూల్సు ప్రకారం 7, 6 పాత పైసలు చార్జి చేయవచ్చు దీ మీద సర్చార్జీని కూడ విధించుకోవచ్చు కాని చాలాచోట్ల వారు విధించడ లేదు ఇప్పుడు సర్చార్జీతో కలిపి మైలుకు ఎనిమిది దమ్మిడీల కన్నా ఎక్కువ కాకూడదు అంటే ఒక్క రూ కి 25, 26 మైళ్ళు ప్రయాణం చేయవచ్చు ఆంధ్రదేశంలో యిక క్రొత్తగా సర్చార్జీ అంటూ ఏమీ విధించబోవడంలేదు వారు యిచ్చిన amendment ఒప్పుకొన్నప్పటికి నష్టము ఏమీలేదు 25 మైళ్ళకు ఒక్క రూపాయి ఛార్జీకన్నా ఎక్కువవున్న ప్రాంతాలలో ఈ సర్చార్జి వేయము ఈ సవరణ తాత్పర్యము తా గూడా దీ ద్వారానే అమలులోకి వస్తుంది కాబట్టి ఈ amendment చాలా అనవసరమైనది తెలంగాణాలో ఒన్ చార్జీ యింతకంటె అదనంగా విధించవలెదని కూడ నేను వెంటనేనే చెప్పాను ఈ amendment యొక్క తాత్పర్యం అదేగాబట్టి am ndment యిక్కడ అనవసరమని నా ఉద్దేశ్యము

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ప్యాసింజర్సుకు అన్యాయము కాకపోయినట్లయితే అసలు క్లాజు యెందుకు వచ్చింది ?

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఆ చట్టం యీ చట్టం ఒక్కటయుతం చేసుకుంటున్నాము కాని యిక్కడ వున్నటువంటి రేట్లు యిప్పటికే ఎక్కువగా ఉన్నాయి కాబట్టి యీ సర్చార్జి విధించడమన్నా లేదు గవర్నమెంటుకు అధికారమున్నదిగనుక అని బ్లీకి చెప్పారు డా చేస్తున్నారు అసలు ఒక hypothetical question అది practical question కాదు అందువల్ల యీ ఎమెండ్‌మెంటు తో పాయినప్పటికి నష్టము లేదు వారు చెప్పిన ప్రకారము 4 నయా పైసాలుకన్న యెక్కువ వసూలుచేస్తే యీ surcharge అమలుకురాదు

*Mr Chairman* The question is.

"Add the following proviso to clause 6

'Provided that no tax shall be levied on passengers in case the existing rates of charges are four naye paise and more per mile'"

The motion was negatived

*Sri Pillalamarri Venkateswarlu* I beg to move

'Add the following proviso to clause 6.

'and provided further no other tax shall be collected by the Local bodies' "

*Mr Chairman* Motion moved

*Dr B Gopala Reddy* That amendment may be relevant under the second Act, Sir This is only surcharge on goods in Telangana We shall see about it in the second Act It is not relevant in this Act All toll tax, etc , can be discussed when we come to the second Act

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, సవరణ రెలెవెంటు కాదని చెప్తున్నారు అసలు విషయమేమంటే యీ టోల్‌గేట్సు అన్నది ఎప్పటినుంచో వున్నది దీనిని తీసివేస్తే చాలా సంతోషమే ఈ టోల్‌గేటు వసూలు చేయమనే వాడు నాకెక్కడ కనబడటము లేదు ఎప్పుడో 1851 లోనో 1831 లోనో చట్టం చేసి యీ Toll Gate పద్ధతి ఇప్పటికి అలాగునే వున్నది ఇది రద్దు కావలసిన అవసరము చాలా వున్నది దానిని రద్దు చేయకుండా యిప్పటివరకు యీ Toll Gate వసూలు చేయడము యీ తెలంగాణాలో జరుగుతున్నది ఇప్పుడు కాంగ్రెసు పార్టీలో మెజారిటీ వుండుటచేత యీ బిల్లు సునాయాసముగా పాస్ అయిపోతుందని చెప్పినారు ఆ ప్రకారము పాస్ అయినట్లేనని భావించేట్లయితే రూ 270 లు సంవత్సరానికి మనము పన్ను వేయబోతున్నామన్నమాట దీని ప్రకారము బెజవాడలో బయలుదేరి హైదరాబాదుకు పోతేగాని, లేక హైదరాబాదులో బయలుదేరి విజయవాడ పోయే లారీగాని ఈ రెండు కూడ రోజుకు కనీసము రూ 3—టోల్ గేట్ కట్టవలసిన అవసరము వస్తుంది అంటే నెలకు 90 రూపాయలు వరకు Toll Gate కట్టుకోవాలన్నమాట ఈ లెక్కలో సంవత్సరానికి వెయ్యి రూపాయలు పైగా Toll Tax చెల్లించవలసిన అవసరము వుంది దానిని బట్టి ఎంత పెద్ద మొత్తము చెల్లించవలసి వస్తుందో ఒక్కసారి చూడవలసినదని యీ సభవారిని కోరుచున్నాను ఈ Toll Gate పద్ధతి ఆంధ్రలో రద్దయినది ఇది సమన్వయ పరచాలని చెప్తున్నారేగాని తక్షణము Toll Tax ను రద్దు చేయడానికి మాత్రము ప్రభుత్వము అంగీకరించలేదు పోనీ యీ ఆక్టులో provide చేస్తుందా అంటే—అది చేయలేదు పోనీ Executive Odr ద్వారా Tol Tax వసూలు చేయడానికి వీలు లేదని ప్రభుత్వము ఆదేశము పంపలేదు ఈ ఆక్టులో లేదు వచ్చే ఆక్టులోనైనా చూద్దామనేటటువంటి హామీ యిస్తారా అంటే అది లేదు అలాగ హామీ ఇచ్చి యీ బిల్లును ఆమోదించినట్లయితే నాకేమీ అభ్యంతరం లేదని చెప్పినప్పటికిని, వినిపించుకోకుండా భరించడానికే అంగీకరించారు దానికి వారు అంగీకరించ నవసరము లేదు గాని యిది చాలా ముఖ్యమైన విషయమని యీ హౌస్ దృష్టికి తీసికొని వస్తున్నాము అసలు Surcharge వేయడం న్యాయమా? అన్యాయమా అని నేను అడుగుతున్నాను ఈ విషయాలు యిదమిద్ధముగా తెల్పి మంత్రివర్గము తరఫున ఇది అన్యాయమని చెప్పినట్లయితే నా amendment ఉపసంహరించుకోడానికి

నాకేమి అభ్యంతరము లేదు ఈ రోజులలో లారీలు నడుపుకొనేవారు రోజుకి రేక 3-8-0 రూపాయలవరకు చెల్లించుకోవలసి వస్తుంది మంత్రివర్గము అసలు యీ టోల్‌గేట్ల విషయాలు ఏమైన తెలుసుకొనడానికి ప్రయత్నాలు చేస్తున్నారా? అనే అనుమానము నాకు కలుగుచున్నది హైదరాబాదులో రూ 3-0-0 వసూలు చేస్తున్నారు వరంగల్లులో 2 రూపాయలు, కరీంనగర్‌లో 1-8-0 రూపాయలు ఖమ్మంమెట్‌లో 3-8-0 రూపాయలు వసూలు చేస్తున్నారు పేద్దపల్లిలో 4 రూపాయలు వసూలు చేస్తున్నారు ఎంత విచిత్రంగా యీ Toll Gates వసూలు చేస్తున్నారో చూడమని కోరుచున్నాను పీరికొనసాగిస్తూ యిక్కా surcharge పన్నులను ఎక్కువగా పెంచుకుని పోతుంటే అసలు వ్యాపారపే ఏమై పోతుందో గమనించండి Toll Gates న్యాయం అవునా కాదా అన్నది విచారించాలి Toll Gate Tax ను రద్దు చేయడానికి ప్రభుత్వం ఏ విధమైనటువంటి చర్య తీసుకోలేదు శాసనసభలో బిల్లు పెట్టకపోయినా Executive orders ద్వారా వేసి తీసివేయవచ్చు Double Taxation పేరిట ఇంకొక బిల్లు త్వరలోనే రాబోతున్నది ఇక్కడి లారీలు అక్కడకు, అక్కడ లారీలు ఇక్కడకు రావడము వంపాటు అక్కడ లారీలు వాళ్ళు ఇక్కడ రిజిష్టరు చేయించుకోవడము, ఇక్కడ లారీలు అక్కడ రిజిష్టరు చేయించుకొనడము కూడ జరుగుచున్నది అందువల్ల ఈ లారీలమీద ఇప్పుడు వేసే టాక్సు ఏదో ఒక ప్రాంతానికి చెందుతుందని మరొక ప్రాంతానికి చెందదని అనుకొనడము చాలా తప్పు ప్రధానంగా యీ Toll Tax ఒక్కొక్క పంచాయతీలో ఒక్కొక్క స్టేషనులో ఒక్కొక్క విధముగా రూ 3, రూ 3-8-0, రూ 4-0-0 లేక రూ 4-8-0 లు వసూలు చేయడము మొదలగునవి పరిశీలించి, మంత్రిగారు చెప్పిన లెక్కల ప్రకారము రోజుకు 3-8-0 ల చొప్పున నెలకు రూ 90 లు, సంవత్సరానికి 1,100 రూపాయల అదనంగా పన్నువేసే పద్ధతిని స్వస్తి చెప్పడానికి ఆలోచిస్తారా? అసలు యీ టోల్‌గేట్లు రద్దు చేయడానికి నిర్ణయించబోతున్నారా? ఆ విధముగా బిల్లు తెస్తామని గాని, executive orders వేస్తామని గాని చెప్పితే సంతోషిస్తాము లేకపోతే నా సవరణను ప్రెస్ చేయడము లేకపోతే ప్రెస్ చేయవలసి వస్తుంది

శ్రీ బి శంకరయ్య —అధ్యక్షా! ఈ బిల్లు ప్రవేశపెట్టుతూ మంత్రిగారు చెప్పిన సమాధానం వింటే "మేక పిల్ల తోడేలు" కథ జ్ఞాపకమునకు వస్తున్నది సరియైన సమాధానము చెప్పడము లేదు ఈ బిల్లువల్ల ఇప్పుడున్న Double Tax పోతుందని చెప్పినారు కాని Double Tax ఏ విధముగా పోతుందో తెలియదు ఈ బిల్లు surcharge కి సంబంధించినది Surcharge వేసినంత మాత్రాన Double Tax ఎట్లా పోతుందన్న విషయము కూడ చెప్పలేదు వాస్తవము విచారించితే, దానికి సమాధానము యేమియు లేకుండావున్నది Toll Gate తీసివేసినందువల్ల యీ సర్‌చార్జి యిక్కడ వేశామను చున్నారు ఉదాహరణకు మద్రాసులో కన్యాకుమారి ప్రజాస్వామ్యంలో యిదే రాదిరిగా వుంది కదా? అక్కడ యెందుకు వ్యతిరేకించలేదని అడుగుచున్నారు అక్కడ surcharge వుంటే Toll Gates లేవు అందుచే ఆదేవిధముగా యిక్కడ యెందుకు చేయకూడదు? ఇదేమీ పెద్ద విషయముకాదు ఈ సవరణ యిదే విధముగా ఆమోదించాలి లేక యింకొక

విధముగా చేసతాలన్న విషయము దృష్టియుందుంచుకొని సరియైన ప్రతిపాదనలు చేయుడము న్యాయము అతేగాని ప్రజలకు యే గ్యారంటి యివ్వకుండా ఏదో ఒక విధముగా బిల్లు ప్యాస్ చేయించాలనే చూస్తున్నారు In effect గా యీ surcharge రూపేణాలోనో లేక మరియేయితర పన్నుల రూపములోనో వేసిన పన్నులు అన్ని ప్రజలపైపడే భారమన్న విషయము అందరికీ తెలుసు

నాలుగు వయాపైసలకు సంబంధించిన సవరణను కూడ అంగీకరించరేం ఎట్లాగో అట్లా యీ బిల్లును పాస్ చేయించడమే వారి ఉద్దేశముగ కనబడుతున్నది ఈ పన్ను పరోక్షపు పన్ను ఇది సామాన్య ప్రజలమీద, సరుకులు రవాణాచేసే వారిమీద పడుతుంది ప్రజా సామాన్యము యొక్క ఆర్థిక స్థోమతను దృష్టిలో పెట్టుకొనే యీ పన్నులు వేయాలి అదనపు పన్నులు వేయదలచినప్పుడు ప్రజల, వ్యాపారస్థుల స్థితిగతులను దృష్టిలో ఉంచకోవాలి అన్ని విషయాలనూ సమగ్రంగా ఆలోచించాలి మేము ఇదివరకు ఇచ్చిన సవరణలను మంత్రిగారు అంగీకరించలేదు కనీసము దీనినైనా అంగీకరించమని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —టోల్‌గేట్లకు సంబంధించిన విషయముతో స్థానిక సంస్థల శాసనములను సంబంధించవలసియుంటుంది ఈనాడు తెలంగాణాలో తక్కువ పన్నులు ఉన్నవి అవి ఇంచుమించు ఆంధ్రప్రాంతములోని పన్నుల స్థాయికి వచ్చినప్పటికి యీ విషయాన్ని మనము ఆలోచించుకోవచ్చు ఈ బిల్లు ప్యాస్అయిన తరువాత టోల్‌గేట్ల విషయముపై దర్యాప్తు చేయ్యటానికి ఒక కమిటిని వేద్దామని గవర్నమెంటువారు కూడ అనుకుంటున్నారు టోల్‌గేట్ల విషయము ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చినందులకు శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారికి శ్రీ ఎనవారెడ్డి శంకరయ్యగారికి ప్రత్యేకమైన వందనములు తెలుపుతున్నాను

*Mr Chairman* The question is

"Add the following proviso to Clause 6

'and provided further no other tax shall be collected by the local bodies' "

The motion was negatived

*Mr Chairman* —The question is

"That Clause 6 stand part of the Bill"

The motion was adopted

Clause 6 was added to the Bill

Clauses 7 and 8

*Mr Chairman* —The question is

"That clauses 7 and 8 stand part of the Bill"

The motion was adopted

Clauses 7 and 8 were added to the Bill.

డాక్టర్ జి. గోపాలరెడ్డి.—తెలంగాణా ప్రాంతములోని బస్సులకు యీ హెచ్చింపు వర్తింపచేయకుండా ఉండుటే మా వుద్దేశ్యము అంతేగాని కొన్ని జిల్లాలను, కొందరు వ్యక్తులను మినహాయించుటకు యీ క్లాజు వుద్దేశింపబడలేదు తెలంగాణాలోని బస్సులకు యీ పన్ను వర్తించదని నోటిఫికేషన్ జారీ చేస్తాము

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —ఆ విషయము క్లాజులోనే స్పష్టముగా పొందుపరిచితే బాగుంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి —చట్టములలో తెలంగాణా, ఆంధ్ర అనే భేదములు చూప నక్కర్లేదు

*Sri Pillalamarri Venkateswarlu*. I beg to move

"In line 8 of the clause 9 add the following after the word 'payable'

'In cases when the vehicle is kept out of use for a continuous period of two months and when there is a considerable fall in the collections"

*Mr Chairman* Motion moved

*Sri M Nagi Reddy* —I beg to move

"In sub-clause (2), under '19 Exemptions' of clause 9, for the words 'two months', substitute the words 'one month"

*Mr Chairman* Motion moved

*Sri M Nagi Reddy* I beg to move

"In sub-clause (2) under '19 Exemptions' of clause 9, for the words 'two months', substitute the words 'fifteen days,'

*Mr Chairman* —Motion moved

శ్రీ యం నాగిరెడ్డి —ఈ క్లాజులో యీ విధముగా ఉంది

"     grant an exemption, make a reduction in the rate or order other modification, in regard to the tax payable—)"

ఇంగ్లీషు భాషలో ఉన్న పాఠ పదాలు ఇందులో ఉన్నాయి మోడిఫికేషన్ అనేదానిని ఆసరాచేసుకొని పన్ను ఎక్కువ చేయవచ్చును.

డాక్టర్ బి గోపాలరెడ్డి —మాడిఫికేషన్ modification అంటే enhancement కాదు

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —తెలంగాణాలో నడచే బస్సులకు ఇది వర్తించదని స్పష్టంగా ఇది బిల్లులో చెప్పనిది ప్రభుత్వము యొక్క ఉద్దేశము ఇదే ఐనప్పటికి ఉత్తరోత్తరావానికి మరొక విధమైన ఇంటర్ప్రిటేషన్ రాకుండా యీ జాగ్రత్త తీసుకోవలసి ఉంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి —శాసనములకు సంబంధించినంతవరకూ ఆంధ్ర, తెలంగాణా అని విభజించనక్కరలేదు రూల్సు తయారుచేసేటప్పుడు యీ విషయము జ్ఞాపకంపెట్టుకోవచ్చు శాసనములో యీ కేటాయింపు లేకుండా ఉంటే బాగుంటుంది

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —యీ క్లాజులో వేరువిధంగా ఇంటర్ప్రెట్ చేసి దుర్వినియోగముచేయడానికి అవకాశములున్నాయని నా అభిప్రాయము

డాక్టర్ బి గోపాలరెడ్డి —దుర్వినియోగముచేస్తే చాలా కమిటీవంటివి వస్తుంది

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —గవర్నమెంటువారు నియమిస్తేకదా అట్టి కమిషను వచ్చేది ప్రభుత్వమువారి బస్సులను, లారీలను మినహాయించాలని స్పష్టంగా ఉంటే బాగుంటుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి —ప్రభుత్వమువారు బస్సులను, లారీలను, కారులను మినహాయించడముకాదు ఇతరుల బండ్లకు ఏ నిబంధనలు వర్తిస్తాయో ప్రభుత్వమువారి బస్సులకూ ఆ నిబంధనలే వర్తిస్తాయి

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —యీ బిల్లుకు సంబంధించిన రూల్సును ఎసెంబ్లీముందు ఉంచవలెననే నిబంధన యిందులో లేదు అందువల్ల అధికారులు వారి ఇష్టమువచ్చినట్లుగా ఉత్తరువులు జారీచేసే అవకాశమున్నది

డాక్టర్ బి గోపాలరెడ్డి —రూల్సును ఎసెంబ్లీముందు పెడతాము రెండు నెలల వ్యవధి ఉంటుంది అవసరమైతే వాటిపై చర్చజరుగుతుంది కూడా బిల్లులో యీ విధంగా ఉంది

Every notification issued under sub-section (1) shall be laid on the table of the Legislative Assembly of the State for a period of two months when the Assembly is in Session At any time, the hon Member can raise a debate within 2 months

శ్రీ యం నాగిరెడ్డి —యీ బిల్లువిషయమై నా అభిప్రాయములేవో స్పష్టముగా చెప్పవలె నాలుగు నయాపైసలు మించి పన్ను విధించమని స్పష్టముగా చెప్పమంటే కాదంటున్నారు యీ క్లాజులో ఉపయోగించిన మాటలను చూస్తే పన్నులు,

పెంచడానికి కూడా అవకాశ మున్నదేమోనని అనుమానము కలుగుతున్నది యీ విషయాలను తిరిగి ఆలోచించమని కోరుతున్నాను యీ బిల్లు రీత్యా చేయబడే నిబంధనలను పరిశీలించ డానికి రెండు నెల వ్యవధి వున్నదన్నారు ఇతర బిల్లులకు చెందిన రూల్సును చర్చించ డానికి 15 రోజుల వ్యవధి మ త్రము ఇస్తున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —అన్నిటికి 15 రోజులు వ్యవధి ఇచ్చినా ఈ బిల్లు విషయములో మాత్రము రెండు నెలలు ఇచ్చాము 15 రోజులు మాత్రము వ్యవధి చాలునని గౌరవ సభ్యులు అభిప్రాయమా ?

బిల్లు ఆమోదింపబడిన తరువాత నోటిఫికేషన్ జారీ చేస్తాము తోడనే రూల్సున్న ఎసెంబ్లీ ముందు పెడతాము. తరువాత రెండు నెలలలోపల వ టిని చర్చించ వచ్చు

శ్రీ బి శంకరయ్య —అసెంబ్లీలో, ప్రభుత్వం ప్రవేశ పెట్టేటప్పుడు, దానికి ముందుగానే ఇన్నిరోజుల టైము లోపల డిస్కస్ చేయువచ్చునని చెబితే, యీ సవరణ అవసరం లేకుండా పోతుంది

డాక్టర్ బి గోపాలరెడ్డి —అటువంటి విషయాలు చూచుటకు సబార్డినేట్ లెజిస్లేషన కమిటీ ఉన్నది

*Sri Pillalamarri Venkateswarlu* —I beg leave of the House to withdraw my amendment (No 9 )

The amendment was, by leave of the House, withdrawn

*Sri M Nagi Reddy* I beg leave of the House to withdraw my amendments (Nos 12 and 13).

The amendments were, by leave of the House, withdrawn

*Mr Chairman* The question is

"That Clause 9 stand part of the Bill"

The motion was adopted.

Clause 9 was added to the Bill

CLAUSES 10 AND 11

*Mr Chairman* —The question is

"That Clauses 10 and 11 stand part of the Bill"

The motion was adopted

Clauses 10 and 11 were added to the Bill.

CLAUSE 1 (*Short Title and Commencement*)

*Dr B Gopala Reddy* I beg to move

"In clause 1 for the figures '1957', substitute the figures '1958'"

*Mr Chairman* —Motion moved

(pause)

The question is

"In clause 1 for the figures '1957,' substitute the figures '1958'"

The motion was adopted

*Mr Chairman* —The question is

"That Clause 1, as amended, stand part of the Bill"

The motion was adopted

Clause 1, as amended, was added to the Bill

*Preamble*

*Dr B Gopala Reddy* I beg to move

"In the enacting formula, for the words 'Eighth year', substitute the words 'Ninth year'"

*Mr Chairman* —Motion moved

(pause)

The question is

"In the enacting formula, for the words 'Eighth year' substitute the words 'Ninth year'."

The motion was adopted

*Mr Chairman* —The question is

"That the Preamble, as amended, stand part of the Bill"

The motion was adopted

The preamble, as amended, was added to the Bill.

*Dr B Gopala Reddy* I beg to move

"That the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill 1957, be passed into law"

*Mr. Chairman* Motion moved

శ్రీ యం నాగిరెడ్డి —అధ్యక్షా ఈ బిల్లుకు సవరణలు ప్రతిపాదిస్తూ అనేక విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చాము ఇది పాసెంజర్సు మీద పడకుండా చూస్తామని ప్రభుత్వము నుంచి సమాధానం వచ్చింది ప్రభుత్వం తరఫున గోపాలరెడ్డిగారు చేసిన వాగ్దానాలు రూల్సు రూపంలో రాకపోతే, తరువాత ఈ చట్టం అమలుచేసే సందర్భంలో అనేక ఇబ్బందులకు గురి కావలసి వస్తుంది అనేక చట్టముల విషయంలో చూస్తున్నాం లైసెన్సియాక్టు, యింకా తదితర యాక్టులు అమలులోకి వచ్చినప్పుడు సరైన రూల్సు లేక పోవుటవలన చాల ఇబ్బంది కలిగింది.

తెలంగాణా ప్రాంతంలో స్టేట్ బస్సుల విషయంలో సర్కారుకో వచ్చినను కాని చిన్న చిన్న రోడ్లమీద పది ఇరువై మైళ్ళు, నలుగురయిదుగురు పాసెంజర్సును ఎక్కించుకు నడుపుకునే బస్సుల విషయంలో ఇబ్బంది అవుతుంది ఇటువంటి బస్సులు గణనీయమైన సంఖ్యలోనే ఉన్నాయి వాటి విషయంలో, రూల్సు లేనందు కారణంగా, అదనపు పన్ను కట్టాలని ఆఫీసర్సు జోక్యం చేసుకునే పరిస్థితులు ఏర్పడుతాయి కాబట్టి అటువంటి బస్సుల విషయంలో పాసెంజర్సు మీద ఇది పడదని పూర్తిగా ఎగ్జెమ్షన్ ఇస్తూ రూల్సు పెట్టునప్పే ట్రాన్సుపోర్టు ఆఫీసర్సుకు పంపాలి లేకపోతే ఆంధ్రప్రాంతపు యాక్టు వచ్చిందని డబ్బు కట్టమనటం, బస్సులను జప్తు చేయటం కూడా జరుగుతుంది ఒకసారి ప్రభుత్వమునకు కట్టిన డబ్బు వాపసు తీసుకోవాలంటే, కట్టినది 50 రూపాయలైతే, దానిని వాపసు తీసుకునేటప్పటికి రూ 100 లు అవుతుంది కాబట్టి మా అమెండుమెంటును మంత్రిగారు అంగీకరించకపోయినా 4 నయాపైసలు అప్లై చేయకూడదు — అని ఓరల్‌గా అంగీకరిస్తున్నారు కాబట్టి ఆ విషయం ప్రతి ఆఫీసర్సుకు పెట్టనే తెలియుటకు రూల్సు ఫ్రేమ్‌చేసి పంపాలని కోరుతున్నాను

డాక్టర్ బి. గోపాలరెడ్డి —ఇది 1 ఏప్రిల్ నుంచి అమలులోకి వస్తుంది ఆ లోగా కావలసిన ఎగ్జెమ్షన్సు యిస్తూ రూల్సు జారీ చేస్తామని చెప్పుచున్నాను బస్సుల విషయంలో సర్‌చార్జి ఇక్కడ ఏమీ వేయుట లేదు ఆంధ్రలో కూడ 4 నయాపైసలు వున్నచోట్ల యిది తీసివేస్తాము అందుకు కావలసిన అన్ని చర్యలు తీసుకోగలము నాగిరెడ్డిగారి సూచనల్ని అంగీకరించుటకు తయారుగా వున్నాము

*Mr Chairman* The question is

"That the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1957, be passed into law"

The motion was adopted

## The Hyderabad Motor Vehicles Taxation (Andhra Pradesh Amendment) Bill, 1957

*Dr B Gopala Reddy* I beg to introduce "The Hyderabad Motor Vehicles Taxation (Andhra Pradesh Amendment) Bill, 1957 and move that the Bill be taken into consideration at once

*Mr Chairman* Motion moved

డాక్టర్ బి గోపాలరెడ్డి —అధ్యక్షా, మొదటి బిల్లు కన్న ఇది ప్రధానమైనది తెలంగాణాకు సంబంధించినంతవరకు ఇక్కడ మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ చాలా తక్కువ హిందూ దేశములోని 14 స్టేట్సులో, ఇంత తక్కువ టాక్సేషన్ ఎక్కడలేదు కొన్ని లెక్కలు చదివి వినిపిస్తాను గౌ|| సభ్యులందరికీ పంచిపెట్టినాము కూడ స్టేట్ కేరేజెస్‌కు తెలంగాణాలో సంవత్సరానికి 400 రూపాయలు ఉంటె ఆంధ్రదేశంలో 5,440 రూపాయలు ఉన్నది బెజవాడలో 5,440 రూపాయలు కడుతున్న బస్సుకు, అదే కెపాసిటీగల బస్సుకు సూర్యాపేటలో 400 రూపాయలు మాత్రమే ఉన్నది తెలంగాణాలో ఉన్న రేటుకన్నా ఆంధ్రదేశంలో ఉన్న రేటు ఎన్ని ఇంతలు ఎక్కువ ఉన్నదో ఆలోచించండి తెలంగాణాలో ఉన్న రేటుకు ఆంధ్ర దేశంలో ఉన్న రేటుకు చాలా తేడా ఉన్నది ఇంత తేడా ఉండటం చాలా ప్రమాదకరం మోటార్ కార్లకు తెలంగాణాలో 40 రూపాయలు ఉంటే ఆంధ్రలో 120 రూపాయలు ఉన్నది మోటార సైకిల్సుకు తెలంగాణాలో 10 రూపాయలు ఉంటే ఆంధ్ర దేశంలో 48 రూపాయలు ఉన్నది ఆటోరిక్షాలకు తెలంగాణాలో 40 రూ ఉంటే, ఆంధ్ర దేశంలో 120 రూ ఉన్నది నాలుగు వీల్స్ ఉన్న మోటారు కేబ్సుకు తెలంగాణాలో 50 రూ ఉంటే ఆంధ్ర దేశంలో 300 రూ ఉన్నది ట్రాక్టర్సుకు తెలంగాణలో 82 రూ ఉంటే ఆంధ్రలో 480 రూ ఉన్నది ట్రయిలర్సుకు తెలంగాణాలో 80 రూ ఉంటే ఆంధ్ర దేశంలో 108 రూ ఉన్నది ఈ మాదిరిగా తెలంగాణా, ఆంధ్ర ప్రాంతంలో రేట్లు ఉన్నవి స్టేట్ కేరేజెసుకు తెలంగాణాలో ఉన్న రేటుకన్నా 14 ఇంతలు ఆంధ్ర దేశములో ఉన్నది ఈ మాదిరిగా ఒక్క బస్సులమీదనే 14 ఇంతలు జాస్తీగా ఆంధ్రదేశంలో టాక్స్ ఉన్నది ఇది న్యాయమైన విషయం కాదు తెలంగాణాలో ఉన్న రేట్లు కూడ ఒక్కసారి ఆంధ్ర దేశంలో ఉన్న రేట్లతో సమానంగా చేయాలని నేను అనుకోవటంలేదు తెలంగాణాలో ఉన్న 400 రూ లను ఒక్కసారే 5,440 రూపాయలు చేయాలంటే కాదు తెలంగాణాలోని రేట్లు కొద్దిగా ఎక్కువచేస్తే, నాలుగైదేళ్ళకైనా అక్కడ, ఇక్కడ సమానంగా ఉండేటట్లు చూడవచ్చును ఇప్పుడు స్టేజ్ కేరేజెస్‌కు తెలంగాణాలో ఉన్న 400 రూ లను 1,200 రూ లకు పెంచుతున్నాము అంటే, 400 రూ లను ఒక్కసారే 5,440 రూ లకు పెంచటంలేదు నిజానికి ఒక్కసారే 400 రూ లను, 5,440 రూ వరకు పెంచేదానికి మాకు అధికారము ఉన్నది బెజవాడలో ఎంతపన్ను కడుతున్నారో అంతే సూర్యాపేటలో కూడ కట్టండని చెప్పవచ్చు కాని అట్లా చెప్పటంలేదు ఇప్పుడు ఉన్న రేటుకు మూడు ఇంతలు మాత్రమే పెంచుతున్నాము ఇప్పుడు 400 రూ లు 1,200 రూ లకు మాత్రము పెంచుతున్నాము

శ్రీ కె ఎల్ నరసింహారావు —ఈ రెండు ప్రాంతాలలోని పన్నును సమానం చేయటానికి ఆంధ్రలో ఉన్న పన్నును తగ్గించండి ఆవిధంగా తగ్గించి రెండు ప్రాంతాల పన్నులను సమన్వయం చేయవచ్చును కదా?

డాక్టర్ బి గోపాలరెడ్డి —తగ్గించే మాట ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో లేదు తగ్గించే మాట ఎత్తవద్దు ఈ టాక్స్ కొత్తగా ఆంధ్ర దేశంలో వేసిందికాదు ఈ టాక్స్ మద్రాసు రాష్ట్రంలో ఉన్నది మలబార్‌లో ఉన్నది మైసూర్ రాష్ట్రంలో ఈ టాక్స్ తగ్గించలేదు కేరళ ప్రభుత్వంవారు తగ్గించలేదు ఒరిస్సాలో మనకన్నా ఎక్కువ టాక్స్ ఉన్నది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు — కాదు మనకన్నా తక్కువ ఉంది

డాక్టర్ బి గోపాలరెడ్డి — కాదు ఒక్క ఒరిస్సాలోనే మనకన్నా ఎక్కువ టాక్స్ ఉన్నది మనం ఇదివరకు ఉన్నటువంటిదాన్ని మార్చాలి మార్పే అభివృద్ధి మార్పు లేకపోతే అభివృద్ధిలేదు తెలంగాణా ప్రాంతంలో భారత దేశంలోని ఏ రాష్ట్రంలోను లేనంత తక్కువగా టాక్సు ఉన్నది తెలంగాణా ప్రాంతంలోకన్నా చాలా ఎక్కువగా ఆంధ్ర దేశంలో టాక్స్ ఉన్నది పది ఏళ్లకైనా, ఈ రెండు ప్రాంతాలలోని టాక్సును సమానంగా చేసుకోవలసిన అవసరము ఉన్నది

శ్రీ బసవ మానయ్య —తెలంగాణాలో టోల్‌టాక్స్ రోజుకు 3 రూ చొప్పున వసూలు చేస్తున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఆ సంగతి నేను తర్వాత చెప్తాను తెలంగాణాలో ఎన్ని టోల్‌టాక్స్‌లు కడుతున్నా, ఎన్ని లోకల్‌బాడీస్ టాక్స్‌లు కడుతున్నా, ఆంధ్రలో కడుతున్నటువంటి 5,440 రు లకు సమానంకాదు ఈ యాక్టు పాస్ అయిన తర్వాత, యీ టోల్‌టాక్స్ విషయం ఏమి చేయాలో ఆలోచిస్తాము ఇప్పుడు 400 రు లను 1,200 రు చేస్తున్నాము ఈ టాక్స్‌ను ఇంకా పెంచవలసివస్తుంది ఈ 1,200 ఇట్లాగే ఉంటుందని నేను చెప్పను ఇంకా కావాలంటే ఎక్కువ చేసుకోవలసి ఉంటుంది ఎప్పటికైనా యీ టోల్ టాక్స్ పోతే మంచిదనే ఉద్దేశంలో, యీ టాక్స్ ఎక్కువ చేసుకోవలసి ఉన్నది

ఒక గౌరవ సభ్యుడు —తెలంగాణాలో ఎన్ని మైళ్ళ రోడ్లు ఉన్నాయి? ఆంధ్రదేశంలో ఎన్ని మైళ్ళ రోడ్లు ఉన్నాయి? ఆంధ్రదేశంలో లారీలు ఎన్ని మైళ్లు తిరగటానికి అవకాశం ఉన్నది? తెలంగాణాలో ఎన్ని మైళ్లు తిరగటానికి అవకాశం ఉన్నది? కొంచెం దయచేసి చెప్పాలని కోరుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —సభ్యులు ఆ విషయాన్ని కమ్యూనికేషన్స్ మినిస్టర్‌గారిని అడుగవచ్చును వారు జవాబు చెప్పగలరు తెలంగాణాలో కూడ రోడ్లు ఉన్నాయి

ఒక గౌరవ సభ్యుడు —రోడ్లు లేకుండా, టాక్స్ వేయటం అన్నది న్యాయంకాదు ఆంధ్ర దేశంలో బస్సులకు రోడ్లమీద పర్మిషన్ ఇస్తున్నారు తెలంగాణాలో కాంట్రాక్ట్ మీద పర్మిషన్ ఇస్తున్నారు వాటికి, వీటికి సామ్యం తీసుకువస్తే ఏమాత్రం సరిపోదని చెబుతున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —అందుకనే, పి డబ్ల్యు డి రోడ్ల మీద నడుస్తున్న బస్సులకు టాక్సు 400 రు లను 1,200 రు లకు పెంచుతున్నాము నాన్-పి డబ్ల్యు డి రోడ్లమీద, కచ్చా రోడ్లమీద నడుస్తున్న వాటిపై 800 రు లు వేస్తున్నాము పి డబ్ల్యు డి రోడ్లపై నడుస్తున్న వాటిమీద మూడు ఇంతలు టాక్సు వేస్తున్నాము మిగతవాటిపై, అంటే కచ్చా రోడ్లమీద నడిచేవాటిపై 800 రు వేస్తున్నాము కాబట్టి మేం చేస్తున్నది అన్యాయం కాదు తెలంగాణాలో రోడ్లు లేవు అనటం సరికాదు హైదరాబాదులో సిమెంట్ రోడ్లు చాలా ఉన్నాయి హైదరాబాదులో బ్లాక్‌టాప్ అయిన రోడ్లు కూడా చాలా ఉన్నాయి ఈ సంవత్సరము ప్రభుత్వం చాలా రోడ్లు బ్లాక్ టాప్ చేయించటానికి పూనుకొంటున్నది తెలంగాణాలో రోడ్లులేవు అన్నమాట సరైనది కాదు రోడ్లు ఉన్నా, లేకపోయినా టాక్సేషన్ ప్రిన్సిపుల్ ఒక్కటే రోడ్లకు టాక్సేషన్‌కు సంబంధం లేదు భద్రాచలం ఏజన్సీలో రోడ్లు ఎక్కువ లేవు కాని అక్కడి వాహనాలు కూడా ఇదే టాక్సు కట్టకోవలసివస్తుంది భద్రాచలం ఏజన్సీలో కన్నా ఎక్కువగా అదిలాబాద్, కరీంనగర్ జిల్లాలో రోడ్లులేవు భద్రాచలం ఏజన్సీలో కన్నా తక్కువగా తెలంగాణా జిల్లాలలో రోడ్లు ఉన్నాయని చెప్పటానికి వీలులేదు కాబట్టి రోడ్లకు టాక్సేషన్‌కు సంబంధం లేదు ఎవరైనా ఒకరు ఒక వెహికిల్ నడుపుకొంటున్నప్పుడు, అతడు దానికి టాక్సు ఇచ్చుకోవలసి ఉన్నది కచ్చా రోడ్డుమీద అయినప్పటికి తారు రోడ్డుమీద అయినప్పటికి ఒక మోటార్ వెహికల్‌కు ఒకే టాక్సు ఇచ్చుకోవలసి ఉన్నది పి డబ్ల్యు డి రోడ్లమీద నడిచేవాటిపై 400 రు లను, 1,200 రు లకు పెంచాము కచ్చా రోడ్లమీద నడిచేవాటిపై 800 రు వేశాము గుడ్స్ వెహికిల్స్‌కు తెలంగాణాలో 400 రు టాక్సు ఉంది ఇప్పుడు మేము దానిపై 25 పర్సెంటు ఎక్కువ చేస్తున్నాము అంటే 500 రు పన్ను కట్టండి అని అంటున్నాము ఈ గుడ్స్ వెహికిల్స్‌కు ఆంధ్ర ప్రాంతంలో 1,440 రు టాక్సు ఉన్నది తెలంగాణాలో మోటార్‌కార్లకు 40 రు టాక్సు ఉన్నది దానికి ఇంకొక 20 రు ఎక్కువ కట్టండి అన్నాము మొత్తం 60 రు టాక్సు వేశాము ఆ మోటార్ కార్లకు ఆంధ్రదేశంలో 120 రు టాక్సు ఉన్నది మోటార్‌కార్లకు ఇప్పుడు ఉన్నదానిపైన 50 పర్సెంటు మాత్రమే ఎక్కువ చేశాము మోటార్ సైకిల్స్‌పైన 50 పర్సెంటు ఎక్కువ చేశాము ఇంతవరకు 10 రు ఉన్నది ఇప్పుడు 15 రు చేసినాము తెలంగాణాలో ఆటో రిక్షాలకు 40 రు టాక్సు ఉన్నది ఇప్పుడు 25 పర్సెంటు మాత్రమే ఎక్కువ అయినది సంవత్సరానికి పది రూపాయలు మాత్రమే ఎక్కువ కడతారు అంటే మొత్తం 50 రు చేసినాము అదే బెజవాడలో ఆటో రిక్షాలకు 120 రు లు ఉన్నది అట్లాగే మోటార్‌కార్లకు $\frac{1}{3}$ వంతు పెంచాము ఇదివరకు ఉన్న 50 రు ఇప్పుడు 66 67 నయా పైసలు అవుతుంది దానికే బెజవాడలో 300 రు టాక్సు ఉన్నది ఈ రెండు ప్రాంతాలలోని టాక్సులను సమానం చేయాలనే ఉద్దేశం ఉన్నప్పటికీ ఒకేసారిచేస్తే మోయలేరనే ఉద్దేశంతో యీ విధంగా కొద్దిగా మాత్రమే పెంచటం జరిగినది కాబట్టి యీ బిల్లు చాలా న్యాయమైన బిల్లు అని అంటున్నాను మోటార్ వెహికిల్స్ టాక్సేషన్ క్రింద యీ సంవత్సరం మొదటి 9 నెలలలో (ఏప్రియల్ 57 నుండి డిశంబర్ 57 ఆఖరువరకు) ఆంధ్ర ప్రాంతంలో 153 లక్షలకుపైగా వచ్చింది తెలంగాణాలో 19 లక్షలు మాత్రమే వచ్చింది. ఆంధ్ర ప్రాంతంలోకన్నా ఇక్కడ తెలంగాణాలో

మోటార్ వెహికల్స్ తక్కువలేవు బస్సులు తక్కువ ఉంటే తక్కువ ఉండవచ్చును కేవలం యీ టాక్సేషన్ వ్యత్యాసంవల్ల తెలంగాణాలో 19 లక్షలే వసూలు అయినది కాబట్టి ఇది చాలా న్యాయమైన బిల్లు అని చెబుతున్నాను ఇప్పుడు యీ బిల్లు ద్వారా పన్ను వేయవలసిన అవసరం ఉన్నది ఈ విధంగా పెంచినప్పటికీ కూడా ఆంధ్ర ప్రాంతంతో సమానంగా యీ టాక్సులు ఉండవు ఇప్పుడు యీ టాక్సేషన్ ఎక్కువచేసిన తర్వాత ఆర్ టి డి బస్సులమీద 1,200 రు టాక్సు పడుతుంది మిగతా బస్సులమీద 800 రు లు పడుతుంది అ బస్సులకు ఆంధ్రదేశంలో 5,440 రు టాక్సు ఉన్నది కాబట్టి యీ బిల్లు చాలా న్యాయమైన బిల్లు అని చెబుతూ, దీనిపైన అట్టే చర్చలేకుండా యీ బిల్లును పాస్‌చేయాలని కోరుతున్నాను

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —ఈ బిల్లుద్వారా ప్రభుత్వానికి లారీలమీద ఎంత వస్తుంది, టాక్సీలమీద ఎంతవస్తుంది, మోటార్ వెహికల్స్‌మీద ఎంత వస్తుంది అన్న విషయం మంత్రిగారు చెప్పలేదు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఇందాక పాస్‌చేసిన బిల్లుతో కూడ కలుపుకొని మొత్తం 19 లక్షల రూపాయలు వస్తాయని అంచనా వేయడింది స్టేజ్ కారేజెస్‌మీద 4 లక్షల 68 వేలు, మోటార్‌కార్స్‌మీద 15 వేల 440, మోటార్ వెహికల్స్‌మీద 14,420, ఆటోరిక్షాలమీద 790, మోటార్ కేబ్స్‌మీద 2,784, ట్రాక్టర్స్‌మీద 1,000, ట్రయిలర్స్‌మీద 2,633 గుడ్స్ వెహికల్స్‌మీద 3 లక్షల 90 వేలు, ఇందాక పాస్‌చేసిన బిల్లు ద్వారా తొమ్మిది లక్షలు, మొత్తం 19 లక్షల 9 వేల 870 రూపాయలు వస్తాయని అంచనా వేశారు

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —డబుల్ టాక్సెషన్ గురించిచెప్పలేదు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఇది పాస్ అయిన తరువాత డబుల్ టాక్సేషన్ విషయముండదు ఒకటే యాక్టు ఉంటుంది ఒకటే యాక్టు అయినపుడు డబుల్ టాక్సేషన్ లేకుండా పోతుంది

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు — ఇప్పుడు ఈ బిల్లుయొక్క heading "Andhra Pradesh Amending Bill to the Hyderabad Act" అని వున్నది అందువల్ల "Madras Motor Vehicles Taxation Act" అట్లానేవున్నది

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఈ బిల్లు ప్యాసుఅయినతరువాత Double Taxation లేకుండా తప్పకుండా చూస్తాము

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —తప్పకుండా చూస్తారా?

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఆహా! తప్పకుండా చూస్తాను

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు —అధ్యక్షా, ఈ బిల్లు విషయములో మేము చాలా amendments ఇచ్చాము రావి నారాయణ రెడ్డిగారు కూడ యీ

దీనమున సభలో హాజరుగా లేరు అందువల్ల యీ బిల్లును గురించి చర్చించ టానికి వీలుగా రేపటికి వాయిదా వేస్తే బాగా వుంటుంది అందువల్ల రేపటి వరకు వాయిదా వేయమని కోరు తున్నాను

*Mr Chairman* —No I shall proceed with the amendments I can only adjourn the House at 7 p m today Is there anybody who wants to take part in the discussion ?

*Sri Pillalamarri Venkateswarlu* All of us want to take part in the discussion There is an amendment to refer the Bill to a Select Committee and to elicit public opinion

*Mr Chairman*– I shall proceed with the amendment to clause 2 There is an amendment given notice of by Sri Baswa Manayya Sri Manayya may move that amendment and speak on that

*Sri Pillalamarri Venkateswarlu* —We also want to speak on that amendment

*Sri Baswa Manayya* -- I beg to move

" That the Bill be circulated for the purpose of eliciting public opinion "

*Mr Speaker* Motion moved

శ్రీ బసవ మానయ్య —అధ్యక్షా, ఈ హైదరాబాదు మోటారు వెహికిల్సు టాక్సేషన్ యాక్టును గురించిన amendment గురించి మాట్లాడుతున్నాను హైదరాబాదులో ఇప్పటివరకూ ఉన్న పన్నులకంటే యీ బిల్లుద్వారా ఒకటికి మూడింతలు హెచ్చుగా Tax వేయటానికి సూచింప బడింది ఈ బిల్లుద్వారా ప్రభుత్వంవారు చేసిన సూచనలను కొన్నింటిని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను

డాక్టర్ బి గోపాలరెడ్డి —మూడింతలు అని మానయ్యగారు చెబుతున్నారు మూడి తలు కాదు రెండింతలే మూడింతలు అనేది కేవలం R T D Buses మీదనే పడుతుంది కాబట్టి రెండింతలని చెప్పవలసి యుంటుంది Private people ఎవ్వరిమీద కూడ మూడింతలు పడదు

శ్రీ కె యల్ నరసింహారావు — R T D Buses మీద పడినప్పటికి పరోక్షంగా మామీద కూడ పడేదే కదా ?

డాక్టర్ బి గోపాలరెడ్డి —అది అందరిమీద పడేదే. కేవలం వారి ఒక్కరిమీదనే కాదు

శ్రీ బసవ మానయ్య —ఇందులో వున్నది ఏమిటంటే **Excluding 32 persons** అనేదానిక్రింద **Rs 1,200 plus 36 Rs for every additional person** అని వున్నది ఇదివరకు నాలుగువందలు ఉన్నదానిని 1,200 చేస్తున్నారు అందువల్ల దీనిని మూడింతలకు పెంచుతున్నారు, అని స్పష్టముగా తేలుచున్నది అందువల్లనే మూడింతలు అంటున్నాను ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత తెలంగాణాలో పన్నులు తక్కువ చేస్తారని ఆశించాము విశాలాంధ్ర కావాలని పూజ్యులైన అయ్యదేవరకాళేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద విశాలాంధ్ర మహాసభ జరిగినప్పుడు పన్నుల విషయము వచ్చింది ఆంధ్రలో మాగాణీ భూములకు పన్నులు తక్కువగ వున్నవని వాటితో బాటు తెలంగాణాలో కూడ అటువంటి సౌకర్యాలు వస్తాయని చెప్పడమువల్ల ఇక్కడి తెలంగాణా ప్రజలు పన్నులు ఆంధ్రతోబాటు పన్నులు తగ్గుతవని, అక్కడ వున్న సౌకర్యాలు ఇక్కడ కూడ కలుగజేస్తారని ప్రజలు ఎంతో ఆశించారు అలా చేయకుండా అక్కడ, ఇక్కడ పన్నులు సమన్వయము చేస్తామని అంటూ, మెట్ట భూములకు ఇక్కడ **surcharge** తక్కువగ వున్నదని, మాగాణీ భూములకు అక్కడ తక్కువగ వున్నదని ఇక్కడ లారీల మీద పన్ను తక్కువగ వున్నదని, అక్కడ యింకొక దానిమీద తక్కువగావున్నదని యీ విధంగా తట్టగూడ సమన్వయము చేస్తాము అని చెప్పట ఇంకను ఈ పన్నులను పైకి తీసికొని పోయే దృష్టియే మంత్రులలో కన్పిస్తున్నది పన్నులు తక్కువ చేసి, సౌకర్యాలు ఎక్కువచేసే ఆలోచన ప్రభుత్వములో కన్పించడము లేదు **Taxes** ఎక్కువ చేయడమనేది వస్తే ఇక్కడ ప్రజలు యీ పన్నుల భారము మోయగలరా, లేదా, అనే ఆలోచన చేసినట్లు లేదు ప్రభుత్వానికి ఏవో ఖర్చులు ఎక్కువగ వున్నవని, అవి భర్తీ చేసుకోటానికి పన్నులు ఎక్కువ చేయడమునకు తలపెట్టితే, ఇది ఏక పక్షముగా ఆలోచించినట్లు కనబడుతున్నది అంతే కాని, ఈ పన్నులను ఎక్కువ చేస్తున్నాము, దీనిని ఇక్కడ తెలంగాణ ప్రజలు భరించగలరా లేదా, వారి ఆర్థిక పరిస్థితి ఎట్లా వున్నది అనే ఆలోచన చేసినట్లు లేదు ఇది గాక ఇదివరకు 50 రూపాయలు ఉండే టాక్సును ఇప్పుడు 60 రూపాయలు చేస్తున్నారు లారీల విషయములో వెయ్యి పౌనులు తూకము గలదానికి యిదివరకు 60 రూపాయలు వుంటే ఇప్పుడు 75 రూపాయలు చేస్తున్నారు 125 రూపాయలు వాటికి 156 రూపాయలు, 200 రూపాయలవాటికి 250 రూపాయలు, 400 రూపాయల వాటికి 500 రూపాయలు, నూరు రూపాయల వాటికి 300 రూపాయలు, 320 రూపాయల వాటికి 960 రూపాయలు, 400 రూపాయల వాటికి 1,200 రూపాయలు ఈ విధముగా ఒక్కొక్కదానికి ఇదివరకు ఉంటే, పన్నుకు ఇప్పుడు మూడు రెట్లు టాక్సు పెంచుతున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి —లారీలమీద మాత్రము 25 అదనముగ పడుతున్నది, తరువాత బస్సుల విషయములో **P W D** రోడ్లు కానటువంటి వాటిమీద నడిపిస్తే, వాటికి రెండింతలే హెచ్చింపు చేయబడింది కాని **P W D** రోడ్లమీద నడిపిస్తే మాత్రము మూడింతలు అవుతుంది

శ్రీ బసవ మానయ్య — PWD రోడ్లుకాకపోతే రెండింతలేనని అంటున్నారు మంత్రిగారు PWD రోడ్లమీద నడిచేవాటిమీద అయితే 400 రూపాయలవాటికి 1,200 రూపాయలు చేస్తూంటే, ఉప్పుడు ఇది మూడు రెట్లుకాకపోతే, మరిదాని అర్థముఏమిటి ? PWD రోడ్లు కానటువంటి రోడ్లమీద నడిస్తే, వాటికి తక్కువ అని అన్నప్పటికీ, వాటికి రెండింతలు చేస్తున్నారు అయితే PWD రోడ్లు కానటువంటి వాటికి అక్కడక్కడ వర్షాకాలము లో culverts వగైరాలు గండ్లుపడి చెడిపోతే, వాటిని ప్రభుత్వము ఏ మాత్రము రిపేరు చేయించడములేదు అటాంటివాటికి బొత్తిగా రక్షణయే లేదు ఆగండ్లను, culverts ను ఆలారీ స్వంతదార్లే వారి స్వంత ఖర్చుమీద అవి అన్నిబాగుచేసుకొని నడుపుకోవలసి వస్తున్నది ఇటాంటి యిబ్బందులను ప్రభుత్వము తీర్చడములేదు కేవలము పన్నులు పెంచేమార్గము, ఉలోచనతప్పు, ప్రజల కష్టములు ప్రభుత్వము గమనించడములేదు తరవాత PWD రోడ్లు కాకుండా ఏయే రోడ్లు అయితే ఉన్నవో వాటిమీద culverts కట్టించినట్లు, గండ్లుపడితే బాగుచేయించడము ఎక్కడను కన్పించదు ఈ surcharge అనేది ఆంధ్రలోవున్న రేటును యిక్కడ తెలంగాణాలో యిప్పుడు ప్రభుత్వము తెచ్చిన మొదటి బిల్లు ద్వారా ప్రవేశపెట్టారు తెలంగాణా ప్రాంతములో ఉన్న vehicles కు పేటికైతే తక్కువగ టాక్సు ఉన్నదని అంటున్నారో వాటికి పేరే రోడ్డు వెంబడి ప్రతి పది మైళ్లకున్నూ ఒకచోట Toll Gate Tax కట్టవలసి ఉంటున్నది ఏ రోడ్డు అయినా యాభై మైళ్లు ఉంటే ఆ రోడ్డుమీద సాధారణముగ పది మైళ్లకొక చోట Toll Gate యీ తెలంగాణాలో ఉన్నది అక్కడ లన్ని చోట్ల గూడ Toll Gate కట్టవలసినదే ఉదహారణకు జల్లేపల్లినుంచి ఆరుమైళ్లు పోగానే" కూకుడపల్లివద్ద ఒక Toll Gate ఉన్నది అక్కడినుంచి సంగారెడ్డి వెళ్లగానే అక్కడ ఒక Toll Gate ఉన్నది అక్కడినుంచి జోగిపేట వెళ్లగానే, అక్కడ ఒక Toll Gate ఉన్నది ఈ రోడ్డు అంతాచూస్తే యాభైమైళ్లు దదాపు ఉన్నది దీనికి నాలుగు టోల్‌గేట్లు ఉన్నవి ప్రతి ఒక్కచోట పావలానుంచి ఎనిమిది అణాలవరకు Toll Gate కట్టవలసియున్నది ఈ విధముగా ఒక్కొక్క రోజుకు లెక్కచూస్తే, ప్రతి లారికూడ దాదాపు అయిదు రూపాయలనుంచి పది రూపాయలదాకా ప్రతి రోజూ కట్టవలసి యుంటున్నది దినమునకు 10 రూపాయల చొప్పున నెలకు 300 రూపాయలు అయింది అదే సంవత్సరానికి 1,200 రూపాయలు యీ Toll Tax భరిస్తున్నారు ఆంధ్రలో Toll Gates లేవు గనుక అక్కడ Tax ఎక్కువ ఉండవచ్చు ఇక్కడ తెలంగాణాలో Toll Gates ఉన్నవి గనుక Tax తక్కువ చేయబడియున్నది Toll Gates ఉంటున్నప్పుడు, వీటికికట్టే టాక్సుకాక యింకను యిప్పుడు పన్ను అధికముచేస్తే, యిది ఎక్కువ అవుతుంది లారివాళ్లు చాలామట్టుకు ఆర్థికంగా యిబ్బంది పడుతారన్నసంగతి ప్రభుత్వముగుర్తించాలి సరే యీ పన్ను ఎక్కువ చేసేటట్లుఐతే, టోల్‌గేట్లు తీసివేయండి అని కోరితే, ఆలోచిస్తాం, విచారిస్తాం అంటున్నారు టాక్సు తక్కువ చేయమనిఅంటే, దానికి ఏవేవో సాకులు చెప్పడము కనబడుతున్నది దానికేదో ఉపోద్ఘాతము చెబుతారు చివరికి పెంచడముతప్ప, తగ్గించడమనేది కన్పించడములేదు ప్రజలు ఎంతో ఆశపెట్టుకున్నారు కాని

యింతవరకు సౌకర్యాలు ఎక్కువచేస్తూఉన్న బిల్లు గూడ రావడములేదు తరువాత రవాణా సౌకర్యాల విషయముచూస్తే, రైల్వే శాఖవారు Wagons సరిగా సప్లయి చేయడములేదు ఈ టాక్సులు పెంచడమువల్ల ప్రజలకు మరింత యిబ్బందులు కలగడముతప్ప, ప్రజలకు సౌకర్యాలు చేయడములేదు ప్రజల అవసరాలు ప్రభుత్వము గుర్తించడములేదు ఏవేవో సౌకర్యాలు ప్రజలకు చేయదలచుకున్నాము, చేయబోతున్నాముఅని ఆశలు కలిగించే వార్తలు పత్రికలలో రావడము చూస్తున్నాముకాని, ప్రభుత్వము ఒక సౌకర్యము కూడ ప్రజలకు చేయడము కన్పించదు ఇక్కడ ప్రజలు చాలా నిరాశచెందుతున్నారు కాబట్టి, ప్రస్తుత పరిస్థితులనుబట్టి హైదరాబాదులో తెలంగాణా ప్రాంతానికి సంబంధించినంతమటుకు జిల్లాలలో లారీ ఓనర్లు టాక్సు ఏ మాత్రము హెచ్చుచేసి నప్పటికిని భరించేస్థితిలోలేరు అని ప్రభుత్వము గుర్తించాల్సి ఉన్నది

Gazette లో ప్రచురణ జరిగిన తరువాత ప్రభుత్వానికి representation గాని, ఆక్షేపణగాని ఏమీ రాలేదని మంత్రిగారంటున్నారు హైదరాబాదు మోటారు యూనియన్‌వారు దానిని గురించి తగినంత ప్రచారం చేశారు ప్రభుత్వం దగ్గరకు రిప్రజెంటేషన్ తీసుకు పోయారు ముఖ్యమంత్రిగారిని కలవడానికి వెళ్ళగా వారు కలవడానికి అవకాశం యివ్వలేదని వారు publish చేశారు వారు ప్రయత్నం చేశారు, పత్రికలలో ప్రకటించారు ఈ సందర్భంలో వారు పడిన కష్టాలను print చేసిన పుస్తకం శాసన సభ్యులందరికి యిచ్చారు ప్రభుత్వానికి రిప్రజెంటేషను వచ్చిన తరువాత వారు ఏమి చర్య తీసుకుంటున్నారో ఏమీ తెలియ జేయలేదు వారికి వుండే కష్ట నిష్టూరాలను ఆలోచించకుండా ఏకధాటిగా పన్నులు వేయడానికి ప్రయత్నించడం ప్రజాస్వామిక సూత్రాలకే చాలా విరుద్ధం ఒకవైపున మన ప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ కూడా పోషలిస్టు సామాజిక సిద్ధాంతాలమీద ప్రభుత్వ విధానాన్ని నడుపుతాము, బీదలకు కూలీలకు రైతులకూ సౌకర్యాలు కలిపించే బాధ్యత ప్రభుత్వం వహించి యున్నదని చెబూతూ పరోక్షంగా ఇటువంటి పన్నులు వేస్తున్నారు

ఒక లారీ బరువు పైన, percentage పైన లెక్క ప్రకారం surcharge ఎక్కువ చేస్తే ఆ లారీలవారు 12 అణాలు కిరాయి (బాడుగ) రూ 2 లు చేశామంటారు 8 అణాలు పుచ్చుకునే passenger దగ్గర 1 రూపాయి తీసుకుంటారు ఈ విధంగా ఆ అదనపు పన్నులన్నీ బీదవారిమీద, ప్రయాణీకుల మీద పడుతున్నాయి ప్రత్యక్షంగా కాక పోయినా పరోక్షంగా ఈ పన్నులన్నీ సామాన్య ప్రజానీకమే భరించ వలసి వస్తుంది కనుక ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపడం చాలా అవసరం Gazette publication అయిపోయిన తరువాత యింకా ప్రజాభిప్రాయం తెలుసుకునే దేమిటి అంటారేమో! అయితే Motor Union వారు ముఖ్యమంత్రిగారిని కలవడానికి ప్రయత్నిస్తే వారు సమయం యీయలేదనే దానికి ఏ విధమైన సంజాయిషీ కూడ యివ్వలేదు Gazette లో ప్రకటించిన తరువాత ఏమైనా ఆక్షేపణలు వచ్చినా రాకపోయినా ఇది శాసనసభ ముందుకు వచ్చినది కనుక శాసనసభ్యులు వారి వారి నియోజక వర్గాలనుంచి, ప్రజల నుంచి కొన్ని, పత్రాల ద్వారా ప్రజాభిప్రాయాలు తెలుపుతారు ఈ కారణాలను బట్టి ఇది ముఖ్యమైన బిల్లు కనుక దీనిని ప్రజాభిప్రాయానికి పంపించాలని అధ్యక్షుల వారిద్వారా వినయంగా కోరుతున్నాను.

శ్రీ డి పర్వయ్య —అధ్యక్షా, ఈ బిల్లును సర్క్యులేట్ చేసేందుకు దీనిని ప్రజాభిప్రాయ సేకరణకు పంపడం చాలా మంచిది ఇది ప్రజాభిప్రాయానికి పంపితే మాకు బ్రహ్మాండమైన support వస్తుందని మంత్రిగారికి విశ్వాసమున్నది ఇలాంటి పరిస్థితులలో ప్రజాభిప్రాయ సేకరణకు పంపి ప్రజలు భరించగలరో లేదో భరించ గలిగేస్తారో లేదా తెలుసుకోవడం చాలా అవసరం అందులో నా ఇది తెలంగాణా ప్రజలమీద విధించిన పన్ను కాబట్టి వారికి పోయేది కనుక తప్పకుండా ప్రజాభిప్రాయానికి పంపించాలని మంత్రిగారిని కోరుచున్నాను P W D బస్సుల విషయం వచ్చినప్పుడు ఇది ప్రజలవి ప్రభుత్వ వస్తువు కాదంటారు ప్రయివేట బస్సుల మీద పడదు అంటారు Private Buses విషయం వచ్చినప్పుడు P W D Roads మీద తిరిగే బస్సులకు ఏమి రూ 1 200 వసూలు చేస్తున్నారు, ఇతరులు రూ 800 కదా! ఈ రూ 800 నేలబాటలమీద తిరిగేవాటిమీద వేస్తామంటున్నారు మంత్రిగారు తెలంగాణాలోని నేలబాటల మీద బహుశః ఎప్పుడు ప్రయాణం చేసియుండరు నేలబాటలమీద ప్రయాణం చేసే కార్లకు కూడా రూ 400 నుంచి రూ 800 పెంచాలి కాబట్టి పెంచుతున్నారే తప్ప వారు మంత్రులుగా నేలబాటలు స్థితి ఎమిటో వాటిమీద తిరిగే బస్సు పరిస్థితి ఏమిటో, ఆ రోడ్లపై బస్సులు నడువడానికి సాధ్యమా అనే విషయాలు తెలుసుకొని వుండరు ఈ పరిస్థితి తెలంగాణా సభ్యులకు తెలుస్తుంది మంత్రిగారికి ఈ రోడ్లను గురించి, వాటిమీద తిరిగే కార్లను గురించి, అక్కడి ప్రజలు పడే బాధలను గురించి ఏమాత్రం తెలియదనుకొంటాను ఈ విషయంలో నేను కొన్ని వందల ఉదాహరణలతో ఋజువు చేయగలను సూర్యాపేట నుంచి మిర్యాలగూడెం రావాలంటే 25 మైళ్ళ దూరం ప్రయాణం చేస్తే సరిపోయేదానికి సుమారు 40 మైళ్ళు తిరిగితేనేగాని మిర్యాలగూడెం చేరుకోలేము ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతం వెళ్ళడానికి రాకపోకలు సౌకర్యాలు సరిగా లేని పరిస్థితులలో ప్రజలకు అందుబాటులో వుండడానికి గాను కొన్ని ప్రయివేటు bus routes ను ప్రభుత్వం యిస్తుంది సంవత్సరానికి 12 నెలలయితే ఆ routes మీద బస్సులు మూడున్నర నెలలు పని చేస్తాయి రోజు విడిచి రోజు ఆగిపోయే వాహనాలు కూడా వుంటాయి వర్షాలు కురిసినప్పుడు బస్సులు నడవక ప్రయాణీకులను త్రోవనే అట్టేబెట్టేస్తుంటారు అట్టి రోడ్ల మీద బస్సులు 4, 5 నెలలకంటె ఎక్కువ కాలం పని చేయటం లేదు హుజూర్ నగర్ నుంచి సూర్యాపేటకు ఒక రోడ్డు వున్నది హుజూర్ నగర్ నుంచి సూర్యాపేట వెళ్ళే బస్సు P W D రోడ్డు cross చేసిపోతుంది P W D road మీద ప్రయాణం చేయడానికి వీలు లేదు permit లేని ఇటువంటి routes పై వుండేవాగులను మరమ్మతు చేయడానికి రోడ్లను బాగు చేయడానికి ఆ గ్రామ ప్రజలో లేక bus owners బాధ్యత తెచ్చి పెట్టుకొని పని చేసుకోవాలి తప్ప ప్రభుత్వం ఏమీ బాధ్యత వహించుట లేదు దాని ఫలితంగా ఏరూటు (route) పైన bus పోవాలని licence యివ్వబడిందో ఆ రూట్‌ను వదలి P W D road మీదనే 15 మైళ్ళ వరకు ప్రయాణం చేయవలసి వస్తోంది చిన్న చిన్న వాగులను మరమ్మతు చేయించాలని ప్రజలు ప్రభుత్వాన్ని ఎన్నిసారులు కోరినప్పటికీ ప్రభుత్వం ఏమాత్రం శ్రద్ధ వహించడం లేదు ఇందువల్ల bus charges హెచ్చు అవుతున్నాయి అవన్నీ వీరు ప్రయివేటుగా

శ్రీ డి నరసయ్యా — R T D ఒకటేకాదు

డాక్టర్ బి గోపాలరెడ్డి —మూడింతలు వేసినది R T D ఒక్కదానిమీదనే కదా?

శ్రీ డి నరసయ్యా —కేవలం R T D కి సంబంధించినది ఒకటేకాదు, మనం ఆలోచించ వలసినది ఇక్కడ P W D రోడ్లు వేయనటువంటి లారీలమీద వేసిన పన్నులను అక్కడ ఆంధ్రలో P W D రోడ్లున్న లారీలమీద వేసిన పన్నులతో పోల్చుకుని "ఇదిగో అక్కడ 5 వేల రూపాయల పన్నుంటే యిక్కడ 4 వందల రూపాయలే కడుతున్నారు కనుక ఆ స్థాయిలోకి పెంచుదాం" అంటున్నారు కాని ఆంధ్ర ప్రాంతంతో పోల్చినప్పుడు తెలంగాణా జిల్లా కేంద్రాలలో ఎన్ని బస్సులు నడుస్తున్నాయి? ఎంతమంది ప్రజలు కారులు ఎక్కగలుగుతున్నారు? ఆ సంఖ్య చూడండి ఒక్క విజయవాడనుంచి బందరుకు నడుస్తున్న బస్సుల సంఖ్య వాటి ప్రయాణీకుల సంఖ్యతో పోల్చిచూడండి అక్కడ ఆర్థిక పరిస్థితులు బాగున్నవి Private owners వున్న అవకాశాలనుబట్టి bus route వ్యాపారం జరుగుతున్నదానినిబట్టి, దానితో తెలంగాణాను పోల్చడం చాలా అన్యాయం అందుచేత యీ బిల్లును మనం చర్చించడానికి ముందు ప్రజాభిప్రాయానికి పంపడం న్యాయమైన పద్ధతి తెలంగాణా ప్రజలకు చాలా వాగ్దానాలు చేశాము ఇంతవరకు వారిపై పన్నుల భారంవేసే చట్టములే తీసుకువచ్చాము గాని వారిని బాగుచేసే శాసనం ఒకటయినా యీ శాసన సభలో చర్చించలేదు అందుచేత యిలాంటి చిన్న విషయంపైనైనా ప్రజాభిప్రాయానికి అవకాశం లేకుండా చేయడం మాత్రం చాలా అన్యాయం ఏ విశాలాంధ్ర కోసం తహతహలాడి కృషిచేశారో, ఆ విశాలాంధ్ర ఉద్దేశ్యానికి భంగంకలిగి అసలు లక్ష్యానికే నష్టం జరుగవచ్చు కాబట్టి ఆ విషయం గమనించి ప్రజల విశ్వాసాన్ని చూరగొనేటట్లు మంత్రిగారు కృషిచేయాలనీ, యీ పన్నుల చట్టాన్ని బహుతేలికగా మాత్రం పరిశీలించ వద్దని వినయంగా మనవి చేస్తున్నాను

శ్రీ గోపిడి గంగారెడ్డి —అధ్యక్షా, తెలంగాణా ప్రాంతం రోడ్ల పరిస్థితిని గమనించకుండా పన్నువేయ దలపెట్టిన చట్టం ఇది తామీరాత్ రోడ్లుగాక పల్లెలకు పోయే త్రోవలపై నడచు లారీలపై పన్ను రెండింతలు పెంచమన్నారు తామీరాత్ రోడ్లపై ఎంత ఖర్చు పెడుతున్నారు? గ్రామాలకు పోయే త్రోవలపై ఎంత ఖర్చు పెడుతున్నారు అని ప్రశ్నిస్తున్నాను తామీరాత్ రోడ్లకు ఖర్చుపెట్టిన విధముగానే గ్రామాల త్రోవలపై కూడా ఖర్చు పెడతారని హామీ ఇవ్వ గలరా? తామీరాత్ రోడ్లు మరమ్మతుకు ఖర్చు చేసినట్లుగానే గ్రామాల త్రోవ మరమ్మతుకు ఖర్చుచేస్తే వేసిన మూడురెట్లు పన్ను చెల్లించవచ్చు ఎందుకంటే లారి చెడిపోదు వాళ్ళకు నష్టం కాదు నిర్మల తాలూకాలో మూడు బస్సులు నడుస్తున్నాయి ఆంధ్రప్రాంతాలలో పర్యటించే మంత్రులు ఒకసారైనా ఆ బస్సులు నడిచే పద్ధతి విచారించ లేదు ఆ విధముగా విచారిస్తే దోషము లేదు పోనీ వారిని కలుసుకొని చెప్పడానికైనా వీలుండదు కొంచెము సమయం పెట్టుకొని లెక్క ప్రకారం పోతుంటారు ప్రభుత్వపు బస్సులో 40 సీట్లు లెక్క వుంటే 150 నుండి 200 వరకు కొట్టాలలో తోలిన గొడ్ల విధముగా గాడిదల విధముగా చేర్చుకుంటారు దాని విషయం చెప్పరు. పన్నుల వల్ల ఆదాయం తక్కువ వస్తుందంటారు గాని

ఆ విధంగా అదనముగా ఎక్కించిన ప్రయాణీకులవల్ల వచ్చిన ఆదాయమును లెక్కలలో చూపించరు ప్రభుత్వపు బస్సులలో జనసమ్మర్ధమునకు తగినన్ని బస్సులను వేయడం లేదు చెమటలు కారక పోయినా, చేతులు విరిగిపోయినా కండక్టరు "ఇంకా చూరండి" అని చేర్చుకుంటూ పోతా వుంటారు ఇంతవరకు బస్సులోపలనే మనుష్యులను ఎక్కిస్తున్నారు ఇకనుంచి ఈ పన్నులు పడడ వల్ల బస్సుపైన కూర్చోమంటారు కాబోలు! ఖాన్గీ బస్సులలో ఎన్ని సీట్లుంటాయో అంత మంది ప్రయాణీకులను మాత్రమే కూర్చోనిస్తారు ఆంధ్రప్రాంతంలో ఖాన్గీ బస్సులలో ప్రయాణీకులకున్న సౌకర్యాలు తెలంగాణాలో లేవు బంగళాలలో ఉన్నిబట్టలు తొడుగుకుని నిద్రించే వారికి చేలలో నిద్రించేవారి చలి అర్థంకాదు బంగళా వారు చలికాలం లేదంటారు చేలలోని కూలీ రైతులు కడుపు, కాలు తలకాయ ముడుచుకుని నక్కపిల్లల తీరున చలిలో వణుకుతారు

మిస్టర్ స్పీకర్ —తలపాగా కట్టుకోవచ్చు

శ్రీ గోపిడి గంగారెడ్డి —ఉట్టి తెలంగాణా పరిస్థితిని గమనించకుండా తమకు కీర్తి వృద్ధి కదా, దిగ్విజయం సాధించవచ్చు ననుకుంటారు అది శరీరం పైననే వుంటుంది గాని మనసు పైన కాదు

డాక్టర్ బి గోపాలరెడ్డి —ఆత్మమీద కాదు!

శ్రీ గోపిడి గంగారెడ్డి —ఆత్మదృష్టితో లోతుగా పోవాలి ఆత్మ శరీరాన్ని కదలిస్తుంది కాని శరీరం వశంలో లేనప్పుడు దాని గతి ఏమి కావాలి? సర్కారు బస్సులు నడిచే చోట ఖాన్గీ బస్సులు నడవడానికి అవకాశం లేదని నిబంధనలున్నాయి పైసలు కావాలంటే ఆ నిబంధనలను సడలించాలి అసలు విషయం గమనించకుండా సత్తావుంది కదా అని బత్తెను తీసుకు వచ్చి పోతు అని అనవచ్చు, పోతును తీసుకువచ్చి బత్తె అని అన వచ్చు కాని పోతును తీసుకుపోయి పాలు పితకాలంటే ఏగతి వస్తుందో తెలుసుకోవాలి పోతు పాలీయదు ఇంతటితో సమాప్తం చేస్తున్నాను

*Sri P Gopala Reddy* —May I request you, Sir, to change the time of the meetings to 8-30 a m as before Elderly members like us feel it very difficult to attend the meeting at 2 p m Will you please reconsider and change the timings as before?

*Mr Chairman* —It has been decided by the Business Advisory Committee that the meetings shoud be held from 2 p m to 7 p m till the end of February 1958 Therefore the matter will be reconsidered later

The House will resume the discussion tomorrow Now, the House stands adjourned till 2 p m tomorrow

*The House then adjourned till Two of the Clock on Thursday, the 20th February 1958*